

బీహార్ గవర్నరు శ్రీ ఆర్. ఆర్. దివాకర్ గారు హిందీ ప్రచారక విద్యాలయమును ప్రారంభించిరి.

## విషయసూచిక

# ప్రవంతి

డిశంబరు నెలలో కీ॥ శే॥ శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి

స్మారక సంచికగా వెలువడును

అందు ప్రముఖ రచయితల వ్యాసములూ, పద్యములూ, రెడ్డిగారి కొన్ని రచనలూ ప్రచురింపబడును.

స్మారక సంచిక 150 పేజీలకు తక్కువగాకుండా వుండును.

**సంచిక వెల 1-4-0, (చందాదారులకు ఉచితము.)**

---

# హిందీ ప్రచారక శిక్షణ శిబిరము

1954 అక్టోబరు 21 వ తేదీనుండి 29 వరకు శివరాంపల్లిలో నడుపబడును.

25 మంది హిందీ ఉపాధ్యాయులు శిబిరములోనికి తీసుకొనబడుదురు.

భోజన వసతి ఉచితము.

వివరములకు :—

హైదరాబాదు హిందీ ప్రచార సంఘం

327, రెసిడెన్సీరోడ్డు. హైదరాబాదు.

సంవత్సరం చందా
రు. 2-0-0

విడిప్రతి
రు. 0-4-0

# స్రవంతి

సంపుటం ౧ || ఆశ్వయుజము, జయ సంవత్సరము || సంచిక ౦

సంపాదకీయం

## హిందీ సుహృద్భావ సంఘము



కాశీ నాగరీ ప్రచారిణీ సభ పక్షాన అక్టోబరునెలలో ఒక హిందీ సుహృద్భావ సంఘం దక్షిణదేశంలో పర్యటనం చేయనున్నది. సుప్రసిద్ధ విద్యావేత్త శ్రీ అమరనాథఝా ఈ సంఘానికి నాయకత్వం వహించనున్నారు. సుహృద్భావ సంఘంలో ఉన్న తదితర సభ్యులందరూ పేరెన్నికగన్న హిందీ విద్వాంసులూ, హిందీ కవులూను. ఇదివరలో ఇలాంటి సుహృద్భావ సంఘాలు రెండు దక్షిణదేశంలో పర్యటన చేసినవి. అందువల్ల సుహృద్భావం పెంపొందలేదు సరిగదా, హిందీయెడల కొంతమందిలో విముఖతకూడా పెరిగింది. ఈ సంఘం వారు వెనకటి అనుభవాన్ని గుర్తించి వ్యవహరించగలరని అనుకుంటున్నాము.

హిందీని రాజభాషగా అంగీకరించడానికి దక్షిణదేశంలో ఎవ్వరికీ అభ్యంతరంలేదు. దక్షిణదేశస్థులు హిందీని వ్యతిరేకిస్తున్నారని అనుకోడం భ్రమ. దక్షిణభారత హిందీ ప్రచారసభవారి పరీక్షలలో కూర్చుంటున్న పరీక్షార్థుల సంఖ్యను చూస్తే ఈ విషయం స్పష్టంగా బోధపడుతుంది. వారు వ్యతిరేకిస్తున్నది దేనిని అంటే; పిడివాదం చేస్తున్న హిందీవాదుల మనస్తత్వాన్ని మాత్రమే. నిజమాలోచిస్తే హిందీలోకంటె దక్షిణదేశ భాషల్లో ఉత్తమసాహిత్యం ఎక్కువగా ఉన్నది. దక్షిణభాషల పండితులు కావ్యశిల్పదృష్టితో సమీక్షించి మీరా సూరదాసుల వలె భక్తి తన్మయత్వంతో పాటలు పాడుకొన్న త్యాగరాజాది మహానుభావుల రచనలకుసైతం కావ్యరంగంలో స్థానమీయలేదు శాస్త్ర పరిభాషకు వరిపోయే ఉత్తమ కావ్యాలు దక్షిణదేశ భాషలలో విరివిగా లభిస్తున్నవి. హిందీలో అలాంటి కావ్యాలు తక్కువఅని అంగీకరించక తప్పదు. అట్టిస్థితిలో దక్షిణదేశంలో

హిందీసాహిత్యం గొప్పదనాన్ని గురించి హద్దులుదాటి మాట్లాడితే, హిందీ రాజభాషగా అంగీకరింపబడినది గనుక - ఆభాష మాట్లాడేవారికేదో ఘనత ఉన్నట్లు వ్యవహరిస్తే-హిందీ ప్రచారానికే ముప్పువచ్చే ప్రమాదమున్నది. ఒక ప్రాంతంవారితో ఇంకొక ప్రాంతంవారిని కలపడమే—అంతర్రాంతీయ వ్యవహారాలకు తోడ్పడడమే - హిందీవల్ల కలుగవలసిన ఫలితం. వివిన్న భారతీయ భాషలతో సాహచర్యం లభించినకొద్దీ హిందీలోనూ, తదితర ప్రాంతీయ భాషల్లోనూ ఉత్తమ సాహిత్యసృష్టి జరుగుతుంది. అటువంటి సాహిత్యసృష్టి హిందీలో ఎక్కువగా జరగవలసి యున్నది. అందుకు హిందీవాదులు కృషి చేయవచ్చును. హిందీ ఒక ప్రత్యేకదృష్టిలో రాజభాషగా అంగీకరింపబడినదనీ- ఆ అంగీకరింపబడిన భాష రాజ్యాంగచట్టం స్పష్టంగా వివరిస్తున్నట్లు - ఒక ప్రాంతంవారి మాతృభాషగాదనీ హిందీవారుగుర్తిస్తే దక్షిణదేశంలో సుహృద్భావం దానంతటఅదే ఏర్పడుతుంది.

ఇక హిందీభాష స్వరూపం విషయం. ఆ స్వరూపం ఒకరిచేత శాసింపబడేదీ, తీర్మానాలద్వారా నిర్ధారణ చేయబడేదీకాదు. ఆయారచయితల ప్రతిభ ననుసరించీ, మాట్లాడేవారి శక్తిసామర్థ్యాల ననుసరించీ భాష వికాసాన్ని పొందుతుంది. మడిగట్టుకొని కూర్చుంటామనేవారు అభివృద్ధి నిరోధకులుగా ఉండిపోవలసిందే గాని భాషాప్రవాహాన్ని ఆపలేరు. అట్టిస్థితిలో సంస్కృతశబ్దభూయిష్ఠమైన హిందీనిమాత్రమే వ్యాప్తిలోనికి తెస్తామని చెప్పేమాటలకు విలువ ఉండదు. హిందీవాదులు తయారుచేసిన కార్యాలయాలపేర్లను హైదరాబాదులో చూస్తూనే ఉన్నాము. హైద్రాబాదు ముఖ్యమంత్రి శ్రీ రామకృష్ణరావుగారు ఇంగ్లీషులో చదివితేనేగాని సంస్కృతంలోఉన్న కార్యాలయాలపేర్లు అర్థం కావడంలేదని ఒకసభలో వెలిబుచ్చారు. "అభియంతా అధికారీ తడాగపువరుప యోజన మాపనశాఖ", "తండులశాస్త్రి", "అపోత్సారణ విభాగము" లాంటి శబ్దాలను సృష్టించి కృత్రిమమైన హిందీని వ్యాప్తిలోనికి తేవడంకంటె కొంతమంది సంస్కృత పండితు లంటున్నట్లు సంస్కృత భాషనే రాజభాషగా అంగీకరించరాదా అని పలువురు ప్రశ్నిస్తున్నారు. సుహృద్భావ సంఘంవారు ఈ విషయాలను గమనించవలసి యున్నది.

ఈరోజుల్లో ఉపదేశాలకు విలువలేదు. ఆచరణముఖ్యం. ఆచరణద్వారా హిందీవారు అహిందీ ప్రాంతీయుల సుహృద్భావాన్ని చూరగొని దక్షిణదేశంలో హిందీవ్యాప్తికి తగిన వాతావరణం సృష్టించగలరని ఆశిస్తున్నాము.

కవిత

# వార్ధక్యము

శ్రీ వానమామలై వరదాచార్యులు.

మానవీయ జీవన దిన మార్గమధ్య
గత తృతీయ యామమ ! వార్ధకమ ! తమిస్ర
మిశ్ర సంధ్యా ప్రదోషమా ! మిత్రవైరి !
స్వతను పూర్ణేందు కృష్ణపక్షమ నమోస్తు !

నాదు స్వర్గ సామ్రాజ్యమ్ము నాశపరచి
త్రోయుచుంటివి నరకంపు గోయిలోన
వెనుకకిటులొక్క యడుగును వేయనీవు
సఖిపునర్దర్శనావకాశమ్ములేదు.

పండుటాకు తరువునుండి రాలెడివేళ
ఆకసమున వల్లలాడు విధము
కనులనాడు మూటగట్టి ప్రయాణమై
యరుగునాకు వింటి నరసినపుడు.

కోరుక వచ్చినాడ పృథివీతలయాత్రకు చూచుచుండగా
మూడవ జాము మించె తుదముట్టెను తెచ్చిన డబ్బులన్ని నా
పీడ యదేమొకాని ధరణింబొడపై నడయాడుచుండె వే
గూడగ బోవునో తిమిరకూటములోని నిశీథ మాతృకన్.

మీగడదీసిన పాలై
త్రాగగ రుచిదప్పె వృద్ధదశకావిసనన్
శీగపయివారు పూవటు
లాగిన యభివృద్ధితోడ నలరెడిమేనన్.

బిగిపీడిన వరముల వల
తెగిపోయిన బంధనాల తేలు శుకమ్మై
యెగసిచనె వందమనునది
గగన చలచ్చంచలానుకారిణి యగుచున్.

అతిబాల్యమున భూమి నడుగిడలేకుంటి
వార్ధక్యమున నట్లె వరలుచుంటి
పసితనమ్మున బోసి పాపనై పడియుంటి
వృద్ధాప్యమున నట్లె వెలయుచుంటి.
బాలునై యేవేళ పడకపీడకనుంటి
ముసలినై సెజ్జలో మూల్గుదటులె
బుడుతనై యాధారపడియుంటి నొరులపై
ముదుకనై భూభారముగ వసింతు

మధ్యవచ్చిన యౌవన మహిత సుఖము
కాలపురుషుని గాలాన గ్రాలునట్టి
ఎరయని యెఱింగితిని లేమి నేల నన్ను
జీవనమునకు దూరుని జేయునిటులు.

కటిక కాలుడు సంసార గహ్వరమున
వచ్చిపడిన జీవులకు యౌవన వనస్థ
జీవన గ్రాసములను విశ్రాంతమేపి
పెంచుటలు కోతకనుచు భావింపనైతి.

కురిసినమేఘమ్మై యరసికుండలె తెల్లమొగమ్మువైచె మే
ల్కొరులవి బోసినోటిగుహలోబడి శాశ్వత మస్తమించె సుం
దర దరహాసచంద్రికలు త్వగ్గతిజోలెలు ప్రేలియాడె న
స్థిర నవయౌవనద్యుతి గతించెను పేన కళాయిపూతమై.

దంతమిడమి నొకపదమ్మోవి ముంగల
వడువవీయ దురక వడకజేయు
పండ్లు రాలిపడియు బలమారియు జరారి
కలుకుమారియగుచు కొఱికిచంపు.

ఎవరోయీ చనుచుంటి వీవీచటినుండే యూరికీ తోవ నీ
జవసత్వార్థము లేరు దొంగిలిరి యీ చర్మంపు జోలెల్పతం
బెవరిన్ బిచ్చమునెత్త నూగిపడు నీవీరీతి భీతుండవై
ఎవరిన్ జూచి వడంకుచుంటి విటు నీవే దండధారుండవై.

వనితల వాలుచూపులకు వ్రాలుచు కాళ్ళను బ్రూవిలాసన
ర్తనలకు నాట్యమాడుచు స్మిత స్ఫురదానన పద్మసంపుటిన్
తనప్రియ ప్రాణపంచకమదభ్రమరాళి బలింబొనర్చు యౌ
వన మొక కల్లు కైపువలె వట్టిగనే దిగజారె నాత్మటిన్.

వయసొక కోడెత్రాచువలెవచ్చి యిటన్నెము పున్నె మెర్గన
ట్టి యదువబాల్యమున్గవి వడిన్ నునుమీసలదువ్వి తోసెగా
వి యబల తానెదుర్కొనగనే వడివంగి జయింపజాలకన్
వయిచెను తెల్లమోము విటు బాల విఘాతికి శ్రేయమబ్బునా ?

పేరితమొగమయ్యె నడుమున కూతగొనమి
కూర్చొనగలేవు తలద్రుగ్గ గుల్లయయ్యె
కాళ్ళు మూడయ్యె నీచేతికర్రగూడి
తప్పదిక తలక్రిందైన తాతపేరు.

కడుజీర్ణవస్త్రాల కట్నమ్ములిచ్చెడి
అరవంగి కృశియించినట్టి తనువు
ఎఱుకజెప్పెడి నేడు దిరిగిన పంచాంగ
ములగొవి నీవాక్కు బలము తొలగి

కురిసిపోయిన మేఘ సరసతన్ జాలెడి
వెల్లనౌ నీతల వెండ్రుకలును
అంధకారమును పేరద్దమ్ములిడిచూపు
రూపుమాసిన కంటిపాపజంట

ఎవ్వరోయి నీపయి బండలెత్తి వంచి
తలకు సున్నమురుద్దిరి తాళమిడిరి
వాక్కునకు కన్నులన్ దుమ్మువైచిరింక
మనగలేవు తాతా చాలదినములిచట.

వింజామరమ్ములు వీచుచున్నవి
దరిసినమ్మృతికి నీ నెఱియకురులు
వెక్కిరించుచునుండె పెక్కురీతుల నీదు
బొక్కినోరీ లోకముంగనుగొని
అడవికే దారి దీయగసాగె మునుముందు
గమియించు నీచేతి కఱ్ఱబెలూను
ఈయెలలంగట్టి యూపుచుండెను జరన్
జలహతి నూగుచు వంగు వపువు

అప్పుడప్పుడీ ప్రపంచ వృక్షాంతికముల
విసరు జంఝూనిలాస్ఫటిన్ కసురుగాయ
లెన్నియో రాలిపడుచుండ నెంతవఱకొ
తొడిమె బిగివీడు ఫలములు పడకనుండు.

పండ్లనూరకు పరప్రజలపైననియేమొ
ఒకపల్లులేకుండ నూడబెరకె
మలినబుద్ధిని మానుమనియంచు ముదిమి నీ
తలపైన నీలిమ తరలజేసె

వంగిన నెలవంక వరలునే మలినంబు
వలదు గర్వంబని వంచెనడుము
దండధారు భయమ్ము దప్పగా హరిముందు
దండమిడన్ గేల దండమిచ్చె

ముదిమి యొనరించు నుపదేశమును చెవినిడి
మానవుని దేహమెంతయు మారెగాని
మొండి మనసేమొ యద్దాని మూర్ఖపునడ
మార్చుకొనదయ్యె చింతాకు మాత్రమేని.

బోసినోరును చొంగయు కాసుకేం
పనికిరాని కర్మేంద్రియ ప్రవృత్తి మఱియు
మూత్రముల మాగు చిమ్ము ముద్దుపాన
నందపున్ చిన్నెలగును తాసమునేల ?

---

# ప్రత్యుత్తరము

శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి

నన్ను నేడ్పింప జూచుచున్నాడు స్వామి
నన్ను నవ్వుచు బ్రతుకుమన్నది జగంబు,
ఏడ్పులో నవ్వు, నవ్వులో నేడ్పు జూచి
కొత్తదారుల జనుట — ప్రత్యుత్తరమ్ము !

నాకు విషపాత్ర జూపుచున్నాడు స్వామి
నాకు సుధనోసి త్రావుమన్నది జగంబు,
విషములో సుధ, సుధలోన విషము జూచి
కొత్తదారుల జనుట — ప్రత్యుత్తరంబు !

నన్ను చీకటి గదిజేర్చినాడు స్వామి
నన్ను వెన్నెల కీడ్చుచున్నది జగంబు
తమములో జ్యోత్స్న, జ్యోత్స్నలో తమము జూచి
కొత్తదారుల జనుట — ప్రత్యుత్తరమ్ము !

# కవిత్వ వివేకం 2

—०००—

శ్రీ విద్వాన్ విశ్వం

## కవిత్వ నిర్వచనం

కవిత్వమంటే........?

ఔను కవిత్వమంటే ఏమిటి ? ఈ మీమాంస యీనాటిదికాదు.

మతం, గణితం, దర్శనాలు - వగైరా అన్నిటినీ కలగలుపుగా కలుపుకొని ఉన్న స్థితినిదాటి వేఱొక విశిష్ట స్వరూపంగల సాహిత్యశాఖగా కవిత్వం ఏర్పడి నప్పటినుండీ దీనిని నిర్వచించాలని పెద్దలు ప్రయత్నిస్తున్నారు. ఒకరి నిర్వచనాన్ని మఱొకరు - అతివ్యాప్తి దూషితమనో, అవ్యాప్తికళంకితమనో అంటూనూ ఉన్నారు.

ఏ నిర్వచనమైనా ఆయాకాలంలో పరివ్యాప్తమైవున్న కావ్యప్రపంచాన్ని వివేచించి, తమకు తోచిన ప్రధాన లక్షణాన్ని వానిలో చూచుకొని వ్రాసినట్టిదే. కాబట్టి అవి సర్వేసర్వత్రా శాశ్వతంగా అనువర్తింపక పోవచ్చును. కాని స్థూలంగా చెప్పేవిమటుకు సరిపోనూవచ్చును.

కవిత్వ మనేది కేవలం మహోత్తమ కథావస్తు ప్రపూర్ణ గాథలుగానే ఉండనక్కఱలేదనీ, అవి కేవలం ఒకానొక సంఘటననో, వ్యక్తినో చూచి ఒకానొక సరసహృదయం కల్పించుకున్న భావనకు శరీరంకల్పిస్తే చాలుననీకూడ ప్రాచీన ఆలంకారికులే నిర్ణయించుకున్నారు.

జనజీవితస్రవంతిలో విరిసిన వేయిరేకుల వికచ పద్మాలలా ప్రాకృత గాథలు వందలు వేలుగా లోకంలో వెలసినవి.

వానినికూడ మహాకావ్యాలుగా పరిగణించినవారు, రసమయ వాక్యమే కావ్యమనుకున్నారు. అందుకు తగిన ఉదాహరణలుగా కాళిదాసాదుల కావ్యములనుండి మాత్రమేకాక యీ గాథలనుండి పరిగ్రహించినారు.

ఆనాటి జీవితాన్ని కవిహృదయంతో చూచి వెలువరించిన ప్రాకృత గాథలను కొన్నిటిని ఉటంకించకుండా ఉండలేకపోతున్నాను.

"చెలువు డెటకో వెళ్ళి తలకులలనల చేతి
తళుకుగాజులు పెరుగుటలు లోకధర్మమా ?
తెలియ కడుగుచునుంటి లలన ఏమనకోకు"

అని ఒక అమ్మాయి చెలిమికత్తెను ప్రశ్నిస్తుంది

"తమ్మి పూదేనె తెగద్రావి జుమ్మమంచు
పారిపోయెడి తుమ్మెద బారుగనుము,
తెలియ వాసంతలక్ష్మి కైసేసికొన్న
ఝుణఝుణల మ్రోయు మొలనూలు చాయనుండి."

అని ఒకసుందరదృశ్యం అభివర్ణతమవుతుంది.

"మిసమిసలకోడ ఇంటిలో మసలుమంద
నేస్గుదంతాలు పులితోళ్లు నెట్లువచ్చు
నయ్య మాయింట వర్తకుడా ! అటంచు
వగచె నత్తయ్య వచ్చినవానితోడ."

ఎంత రసస్ఫోరకత - ఎంత దొడ్డయిల్లాలో ఆమాట అన్నది అని మనకు అనిపింపదూ !

"నూరుసారులు ముద్దుల నూరవేయు;
వేయిసారులు కౌగిట వెచ్చజేయు;
ఆపి, ఆపి మఱింతగా నూపవేయు
లేదు పునరుక్తి వలపుల మోదులోన."

ఇవికాక కవిత్వం మఱింకేవి కాగలవు ?

ఇలాంటివే మన పల్లెపదాలలో చాల కనిపిస్తాయి. ఆనాటి హాలుడు లోకంలోని గాధలను సమకూర్చి చక్కని సత్తసయిని చేకూర్చిపెట్టగా మన మీమాత్రమైనా చూడగలుగుతున్నాము. మనం మాత్రం అలాంటిపనికి పూను కొనుటలేదు. మచ్చుకు మన పల్లెపదాలు చూడండి:

"తొలకరి ఒకమబ్బు తొంగి చూచింది.
మబ్బులో ఒకమెరుపు మెరసిపోయింది.

పెరటిలో ఒకజల్లు కురిసి వెలిసింది.
జల్లుతో నామనసు జారిపోయిందీ;
ఏకొమ్మ మీదనో ఎండదాకిన పిట్ట,
ఏటితో ర్రివలుపట్టి ఎగిరిపోయింది.
ఏరువాకానాటి కేడాది దాటింది.
ఎదురుచూచీ గుండె చెదరిపోయింది.
పిట్ట పిట్టా ముద్దు పెట్టుకున్నాయి.
గోవులన్నీ యిల్లు చేరుకున్నాయి.
ఏటిగాలికి చిలుక లెగిరిపోయాయి.
ఎందుకో నాఆశ లెగిరిపోతున్నాయి."

"జొన్న చేనిలోన సొగసుక త్తెను జూచి
నిన్నటాళనుంచి నిద్రరాదు;
దాన్ని నన్ను గూర్చి దయసేయు మాధవా
పొన్నపూలు తెచ్చి పూజసేతు."
"ముద్దు మొగమూదాన ముక్కుపోగూదాన
కాకివేషముదాన కామంచి పడుచా
మచ్చుదిగవే."

అలుక చేనీలోన ఆవులున్నవి భామ
ఆవు మందాసైన అదిలింపరావే ॥మచ్చు॥
కొట్టు చేనీలోన కోడెలున్నవి భామ
కోడె మందాసైన కోపించరావే ॥మచ్చు॥
రూమాల చెఱగునా రూకలున్నవి భామ
మంచెకిందికి రావె పంచుకుందామూ ॥మచ్చు॥

ఇలాంటి రసఖండిక లెన్నో!

మరి యిలాంటి పల్లెపదాలు మొదలు వాల్మీకి రామాయణందాకా సరిపడే నిర్వచనం కావాలి. ఆదంత సులభమా మరి?

మన పూర్వులైన ఆలంకారికులు చెప్పిన లక్షణాలైనా నేడు మన కవిత్వానికి చాలినా అతివ్యాప్తము లవుతాయి.

కారణం నేడు నవల, కథ, నాటకం-వీటికంటె భిన్నమైన ఒక నిర్దిష్ట విశిష్ట సాహిత్యశాఖనే మనం కవిత్వ మంటున్నాము. వాటినుండి కవిత్వాన్ని వేఱు పఱచేదిగా మనం చెప్పుకొనే లక్షణం ఉండాలికదామఱి ?

'రసాత్మక కావ్యమే కావ్య' మన్నా, 'ఇష్టార్థావచ్ఛిన్న పదావళి' కావ్య మన్నా, కవిత్వమంటే 'రమణీయార్థ ప్రతిపాదకశబ్ద' మనుకున్నా అట్లే శక్తి చిత్రమో, రసస్ఫోరకతో కావ్యమనుకున్నా పూర్తిగా నవలనూ, కథనూ. నాటకాన్నీ దాని పరిధిలోనుండి వేఱుపఱచలేము.

కాని ఆనిర్వచనా లన్నిటా ముఖ్యంగా రసస్ఫోరకమైన పద సముదాయం కవిత్వమన్నది ఎన్నటికైనా చెల్లుతుంది — సరే. అయినా మనమీనాడు కవిత్వాన్ని మిగతా రసస్ఫోరక కళారూపాలన్నిటిలోను ఒక ప్రత్యేకరూపంగా చూస్తున్నాము.

ఇంతకూ వారైనా ఎవరైనా కొన్ని ప్రధాన లక్షణాలనుబట్టి, సాహిత్య రేఖలను సృజించుకొని వానిలో నిరగడింపులు చేసుకుంటారు. ఎక్కువభాగం అన్ని శాఖలకూ వర్తిస్తాయి.

మఱి మనం వాటినన్నింటినీ దృష్టిలో ఉంచుకొని, పాశ్చాత్య విమర్శకుల వివరణలనుకూడ మనసున పెట్టుకొని నేటి విశిష్ట కవిత్వ లక్షణా సౌధాన్ని కట్టుకొందాము. ఆ సందర్భములోనే కవిత్వ స్వరూప స్వభావాదులనుకూడ చూచు కొని మన పనిని సులువుచేసుకొనవచ్చును కూడ. ఈ విషయంలో కాడ్వెల్ వివరణం చాల బాగున్నదనుకుంటాను.

కవిత్వం రీతిబద్ధమైనది.

మామూలుగా మనం మాట్లాడేభాషలో ఉన్నంత కంటె విభిన్నమైన విస్పష్టమైన గతి, లయ, రీతి కవిత్వంలో మనకు కనిపిస్తున్నవి.

ఈరీతి ముఖ్యంగా కవిత్వం సమష్టి స్వభావసముపేతమున్న విషయాన్ని పరిస్ఫుటం చేస్తున్నది.

ఒక సమష్టి మహోత్సవంలోని గతి లయలు మనిషి నదొకవిధమైన వేశంతో ముంచివేస్తాయి.

అసలు ప్రకృతిలోనూ, జీవితంలోనూ కూడ ఒకానొక లయబద్ధత రీతి పమపేతత్వం కనిపిస్తుంది. అవే మనలను అంతర్ముఖులను చేసివేసి ఏదో ఒక భావ ప్రపంచంలోనికి కొనిపోతాయి.

మనం కూర్చొని ఏతర్కం చదువుకోవాలన్నా, ఏలెక్క వేసుకోవాలన్నా ఏతత్వం చికిత్స చేసుకోవాలన్నా కొంత అంతర్ముఖత తప్పదు.

కాని యీ అంతర్ముఖత కేవలం బాహ్యావైముఖ్యం మాత్రమేకాదు. ఇది భావనాపూర్వకమైన అంతర్ముఖత. కవి మనలో కలిగించాలనుకున్న ఉద్వేగం మనలో ఏర్పడడం ఆరీతి కొంత పనిచేస్తుంది.

మన శరీరంలోని నాడి టపటపలు, గుండె గుబగుబలు ఏదో లయను సూచిస్తున్నవి. వాని నొక నిమిషం నిమీలిత నేత్రులమై భావించుకుంటే మన మెక్కడికో వెళ్ళిపోతాము.

తడితే పాప నిద్రిపోతుంది తప్పెటకొడితే పసివానికాళ్ళు అప్రయత్నంగా చిందులు తొక్కుటకు పైకిలేస్తాయి.

నిలాగే మాటల పొలకువేలేని ఒక ఆ(.........అన్న ధ్వనో, ఓం అన్న ధ్వనో ఒకవూపుతో కాసేపు ఉచ్చరిస్తే మనం సమ్మోహితులమవుతాము.

ఈ మంత్రముగ్ధత కేవలం వైయక్తికమైనదికాదు. మనం యిలా అంతర్ముఖులమై కవిత్వంద్వారా సర్వమానవ సమానమైన సాంఘిక భావ ప్రపంచంలోనికి వెళ్ళిపోతాము. మానవుని సహజేచ్ఛాపుంజ రూపమైన 'అహం' జీవన ప్రాంగణంలోని అనుభావంతో సమ్మిళితమై, మనలను ఆ ఆనంత అహం కారంతో కలిసిపోజేస్తుంది. అప్పుడే మనం సర్వమానవ భావతరంగ డోలికలలో ఉయ్యేల లూగుతాము.

ఆరీతి అనేక విధాలుగా ఉండవచ్చును. ఒకొక్క సందర్భానికి, భావానికి అనుగుణంగా మారవచ్చును. కాని ఏదోరీతిబద్ధత మటుకు తప్పనిసరిగా కవిత్వాని కొక ఆకారం కల్పిస్తుంది.

"స్ఫురదారణ్య మహీధరాపర
సముద్భూతోగ్రదావానలో
త్కర విస్ఫార శిఖాళిగూడి రవి
కాంత వ్రాత సంజాత దు

స్తర తీవ్రాగ్ని లెసంగివీచె వడ—
ఆ సంక్రుద్ధ కాలాగ్ని రు
ద్ర రయోచ్ఛ్వాస సమేతమోయని
జనుల్ తద్భీతి గంపింపగన్."
(నన్నెచోడుడు)

అన్న పద్యంలోవలెకాక మరింత లలితపద బంధురమూ కావచ్చును.

"పెడవెడ గన్నుమూయు గనువిచ్చు
నగుం దలయూచు బాన్పుపై
బడు నుసురంచులేచు దడబాటును
దత్తరమునుం జలంబులో
నదరగ గోపవేగమున
నగ్గలమైన మనోజ వేదనం
బడి మదహస్తి హస్తగత
పద్మినియుంబలె సొంపు పెంపఱున్.

"హింసన చణ ధ్వంసన చణ ధ్వంసనచణ హింసన చణ
నటధూర్జటి నిటాలాక్షి నిటాలాక్షి నిటాలార్చి
పడితేఖమని పగిలిందీ ప్రపంచాన్ని భయపెట్టింది."

అలాగే

"ఊరవతల నీరింకిన చెఱువుప్రక్క చెట్టునీడ
గోనెలలో సంచులలో ఎటుచూస్తే అటుచీకటి
పటుదుఃఖం పటువిరాళ చెఱసాలలు ఉరికొయ్యలు
కాలువలో ఆత్మహత్య దగాపడిన తమ్ములార
మీబాధలు నేనెఱుగుదు."

అట్లే

"నావివాసమ్ము తొలుత గంధర్వలోక
మధుర సుషమాసుధాగాన మంజువాటి.... ...."
(కృష్ణశాస్త్రి)

"మగటాల జిగిదేలు నగరాల నడివీధి
మొగబట్టి రాళ్ళ మూపురముతో నీడ్చుకొని
బరువైన జీవనాధ్వముబట్టి నడచు
పాంధుల నుదుటిచెమట చూపించి ఏడ్పించినది
ఈ కాంతయే ఈ దయాస్వాంతయే—"

(నా హృదయం నాదే)

అన్నిచోట్లవలె బరువు నడకలు వేయవచ్చును కూడ.

"పరప్రతారణ పరబుద్ధుల మం
పరము వదలి కంపరముప్పట్ట, ఫా
లాక్షుడుతా ప్రత్యక్షంగా యెదు
రొడ్డి నిలిచినా గడ్డిపరకే
కోద్ధతి నుడికే ప్రబుద్ధ జన సం
బరముజూచి అంబరము నందుకొని
విరామ మెయిఁగని పరాకు తెలియని
జరా మరణముల బాయపడని ని
ర్ఘాత వజ్రాఘాత రక్తరంజిత
పరమని శంఖారవముటుల
గర్జిస్తుందీ గాండ్రిస్తుందీ—"

(నా హృదయం నాదే)

అనే చోట్లవలె గలగల సెలయేరులా ప్రవహించవచ్చును.

ఏమైనప్పటికీ ఏదో ఊహ, ఏదో రీతి, ఏదో సంగీతం- తొలగించే పద రచన కవిత్వ లక్షణాలలో ఒకటి. తద్వారా ఒక భావావేగ వాతావరణం సృష్టిత మవుతుంది.

౨. కవిత్వం తార్కిక పంక్తి కాదు.

కేవలం హేతువాదబద్ధమై ఒక విషయాన్ని వివరించే వాక్యం కవిత్వం కాదు. అట్లని యిదేదో ముందు వెనుకలూ, అన్వయమూ, తాత్పర్యమూ లేని అయోమయమని అర్థంకాదు.

కావ్యభాషలోనూ వ్యాకరణమూ, అన్వయక్రమమూ కారకాలూ మాన్నీ, పాటింపబడి తీరుతాయిపరే ;

కాని ఒక విభేదం మనకు స్పష్టంగా కనిపిస్తుంది.

ఏ శంకర భాష్యాన్నో మనం అర్థంచెప్పుకొని వేరుమాటల్లో చెప్పుకున్నా అది శంకరాద్వైత విచారమే అవుతుంది. అలాగే ఏ నవలనో, కథనో అనువదించి సారాంశం వేరుమాటలలో చెప్పినా ఆనవలనవలగానూ కథకథగానూ వుండిపోతవి. కాని ఒకరిపద్యం విడమరచి చెప్పామా అది వారి పద్యంగా ఉండదు.

మామూలుగా శాస్త్రపంక్తి కాని, కవిత్వేతర సారస్వతశాఖ దేనిలోని పంక్తికాని ఒక అభిప్రాయాన్ని వ్యక్తంచేస్తుంది. కవిత్వం అలాకాక ఒక విశిష్ట భావావేగపూరితవాతావరణాన్ని కల్పించి గుండెలోని ఏతీవెలనో కదిపి మనకొక రసానుభూతిని కల్పిస్తుంది.

"మన బుద్ధిశక్తుల కందనిదేదో కవిత్వం" అని షెల్లీ అన్న దిందువల్లనే కావచ్చును. (Poetry is something not subject to the active powers of the mind—Shelly.)

కవిత్వం ఆలోచనకుకాక ఆవేగానికి, అనుభూతికి అనుకూల వాతావరణాన్ని కల్పిస్తుంది.

"నేనుసైతం ప్రపంచాబ్జపు
తెల్లరేకై పల్లవిస్తాను.
నేనుసైతం భువనభువనపు
బావుటానై పైకిలేస్తాను."

(శ్రీ శ్రీ)

వీనిలోని వాక్యాలను మామూలు కారణ కార్యభావోచితమైన కావ్యంవలె వివరించుకోలేము.

"ఆమె కన్నులలో వనంతాంబఠంపు
పిలిపిడలు కలవు—"

(కృష్ణశాస్త్రి)

"ఏటికడుపునదాగి తోట నిదరోయింది"
"ఎన్నెలంతామేసి ఏరు నిదరోతోంది."

(సుబ్బారావు)

దాస్యపు చీకటిమేడలు పగులగొట్టి
తగులబెట్టి రక్తారుణ వైజయంతి
రమ్మన్నది పోతున్నాం."

(దాశరథి)

"కరము పొగరెక్కి నంబర మురు విద్యుద్దీపకళిక
లుమిసిన ధూమ స్ఫురణ బొగజూరె ననగా
హరిమణి జంబూ ఫలాసితామలరుచులన్.

(ఆముక్తమాల్యద)

ఏదో అదో మామూలు భాషకంటే విభిన్నభాషలో మనలో ఏదో ఒక వినిర్దిష్ట భావాన్ని, కల్పించే వాక్యపంక్తి కవిత్వానిది. కాబట్టే అది మామూలు విషయవివేచనా - నివేదనాప్రవణపదవిన్యాసం. కాదనుట సంభవిస్తున్నది.

"ఒకలక్ష నక్షత్రాల మాటలు ఒకకోటి జలపాతాల పాటలు
శతకోటి తరంగాల మ్రోతలు విన్నానమ్మా విన్నాను."

(శ్రీ శ్రీ)

అని కవితామతల్లికి నమోవాకము లర్పించడం యిందువల్లనే.



కవిత

# మరీచికలు

శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

పేదమానవుల బాధా దీనహృదయాన
    రేకెత్తు రిత్త కోరికల వోలె
గగన పాథోరాశి గర్భ గోళము నుండి
    కదలి వచ్చెడు తరంగముల వోలె
దినరాజు ధరియించుకొనిన మేల్శాలువా
    జిలుగు జల్తారు కుచ్చెళ్ళ వోలె
గ్రీష్మము విజయ సంకేతమ్ముగా నెత్తు
    కొను దుకూల పతాక గణమువోలె

దాహమున్ గొన్న జీవుల మోహపెట్ట
గా దిశాకామినుల్ శిరోగ్రమ్ములందు
మోసి తెచ్చు మృషాపయఃపూర్ణమైన
కలశముల వోలె ఎండ మావులు చిహించె.

అంచితమైన నీల గగనాంచల సీమల యందు మేటి తా
యెంచలు రెక్కలార్చుచు పయంబున పర్వులు వెట్టినట్టులన్
చంచల సంచయంబులవి సాధుజనంబు త్యజించినట్టి ప్రా
పంచిక భోగ జాలముల భాతి చరించె మరీచికాతతుల్.

అవి తృషార్తులను ఆహ్వానింప రవళించు
    చిత్రమాయా విపంచీ స్వరాలు
అవి నిరాశా విహాయస పథాంతరములలో
    పరుగెత్తు శూన్య భావముల గుంపు

అవ్వి విద్రాప్రపంచావాససీమలో
　　మొలకెత్తు బంగారు కలల పంట
లవ్వి ముమ్మాయి ముత్యాల పందిళ్లలో
　　ప్రేలాడు తెలిపట్టు మేలు కట్లు

అవి అనాథ జనాళి ఊహాంతరమున
కట్టుకొను గాలిమేడల పట్టణములు
అవి విషాద నిదాఘ వేళాంత రాళ
జీవన మృషా ప్రపలు. ఎండ మావులవ్వి

ద్వాదశాత్ముండు వేయి హస్తాలు విచ్చి
గ్రీష్మ భీష్మాగ్ని పుష్పావకీర్ణమైన
వేడి వుప్పొది గుప్పిళ్ల విసర విట్లు
తెరలు పొరలయి ఈ మృగ తృష్ణలొప్పె

గాలి వార్తలు బంపు విద్యుత్తరంగాలు
కీలు బొమలాడు మిథ్యా నాట్య రంగాలు
ఒక నిరాశా జీవి ఊహా పరంపరలు
ప్రకృతి విడిచెడు వేడి నిట్టూరుపుల తెరలు
కృతకసలిలాపూర్ణ స్వర్ణ భాండాలు
పతిత మానవ శూన్య జీవిత కరండాలు
మృగములను మోసగించెడు మాయ పాచికలు
ఇవి ఆతపజ్వాల లెగసిన మరీచికలు.



కవిత

# వసంతోదయం

శ్రీ జె బాపురెడ్డి

ఈ రసాల వృక్షాల కోయిలగళాలు
పోసిన సుగాన సుధ త్రాగివేసెనేమొ ?
మండుటెండల గ్రీష్ముండు ఎండుబోవ
మధువు గర్భాల పొంగె ఆమ్రఫలజాతి.

లాగెనో లేదొ పసుపు చేలాలు ప్రిదుల
శిశిర దుశ్శాసనుండు గర్జించి వచ్చి
పచ్చపచ్చని కొత్తివ్వలిపమ్ములురల
వనకుమారి వసంతయై పాడెనదిగొ
ఏమురారి మొరాలించె నేమొకాని.

కరడుకట్టిన హిమశిలల్ కరిగి యురిగ
పారె 'వాసంత' కోష్ణనిశ్వాసమందు
విప్లవోషస్వి నీ క్రాంతి వీక్షణాల
కరిగి పారెడు దాస్యాంధకారమట్లు.

విచ్చిన సుమాలు మధువుల వెల్లులురసె
భ్రమరయువకాళి ప్రణయగీతముల కరిగి
హెచ్చిన వియోగబాధ నా ఎదరగుల్చ
భావకవిచేసె నన్నొక దేవిమోవి.

నాడు శిశిరాన ఓదార్చినాడు ఏడ్చి
నాడు; కవి జీర్ణలోకము చూడలేక
నేడు వాసంతమున పొంగినాడు; పాడి
నాడు; శుభగీతి, ముందుండి, నాడునేడు

# తెలంగాణా జానపద సాహిత్య సంపద - 4

—oo:o:oo—

శ్రీ వి రామరాజు

**పల్లెపాటలు** వినోదమునకన్న విజ్ఞానమునకే ఆలంబనములన్నచో నతిశయోక్తి లేదనిపించును. అర్థములేనివనుకొన్న పాటలం దత్యద్భుతములైన శాస్త్ర విషయము లంతర్గర్భితముగా నుండుటే దీనికి కారణము. వేదాదులననుశ్రుతముగా నభ్యసించి కాపాడుకొనినట్లే ఆయుర్వేద, వాస్తు, జ్యోతిష, మంత్ర శాస్త్రములను కూడ మనపూర్వులు పల్లెపాటల పేటికలలో భద్రపరచినారు. గ్రంథస్థములైన విషయములు కేవలము విద్వాంసులకే తెలియును. కాని పాటల రూపమున నున్నచో పామర జనులకుగూడ తెలియునని కాబోలు జనోపయోగ విషయము లెన్నియో పిల్లల పాటలలో పొందుపరచబడినవి. ఔత్తరాహుల జానపద వాఙ్మయమున వైదిక కర్మాచరణ విధానముగూడ నున్నట్లు వింటిని. ఒకానొక గ్రామమున బ్రాహ్మణ స్త్రీలు పాటలు పాడుచు వివాహాది కార్యములు చేయింతురట. పెండ్లికి జరుపవలసిన తంతు ఆ పాటల రూపమున వారినోటి కెక్కినది. ఒకప్పు డుత్తరదేశమున తురకల దండయాత్రా ఫలితముగా కొన్ని కొన్ని గ్రామములు బ్రాహ్మణపురుష శూన్యములై పోయెనట. అప్పట్టున బ్రాహ్మణ స్త్రీలే వారి మాతృభాషలందు (బహుశః పురాణోక్తముగా జరుగవలసిన చోటులందు) వివాహాది శుభకార్యములు, శ్రాద్ధక్రియలు జరిపించిరట. ఆ పాటలే ఇప్పటికిని ఆనోట నానోటబడి బ్రదికియున్నవట. ఈ విషయము కన్నులార గాంచిన ఒక పండితుడుచెప్పి నా కాశ్చర్యము కలిగించెను. తెలంగాణ మందన్ని మండలములందును కొన్నికొన్ని ప్రదేశములు గ్రామములు ఆదినుండియు పండితులకు, కవులకు, సంస్కారులకు తావలములైనవి కలవు. మంథెన, చెన్నూరు ప్రాంతములు వేదపండితులకు; కోరుట్ల, సిరిసిల్ల, ధర్మపురి, మానుకోట, పాలమూరు వేదాంత తర్కశాస్త్రజ్ఞులకు; పాహాపురము; ఇల్లెంద గాయకులకు; పెద్దపల్లి, నాట్యశాస్త్రజ్ఞులకు; నందిళ్ళ వీధిభాగవతులకు; ఓరుగల్లు ప్రాంతములు సాహిత్యకులకు, కవులకు; కల్వకుర్తి, అచ్చంపేట, నాగరకర్నూలు ఆయుర్వేద

వాస్తు జ్యోతిషశాస్త్ర వేత్తలకును వెనుకటినుండి ప్రసిద్ధి కెక్కినవి. ఇప్పటికిని ఆయా ప్రాంతములందు ప్రాత ఘటనలు కొన్ని నిల్చియున్నవి. సేకరింప నోపిక గలవారి కీప్రాంతములలో తాళపత్ర గ్రంథముల గుట్టలగుపడును. ఈపనికి ప్రభుత్వమో, సారస్వత సంస్థలో పూనుకొనవలయును. నేనొక్కడనే కొన్ని వందల తాళపత్రి గ్రంథముల సేకరింప గలిగితిని. వివరములు వ్రాసినచో విష యాంతర చంక్రమణ మగును. అచ్చంపేట, తెల్కపల్లి ప్రాంతముల స్త్రీలు గృహవాస్తు జ్యోతిష శాస్త్రవిషయ గర్భితములగు పాటలు పాడెదరట. ఈ విషయము లాయా ప్రాంతీయులనోట విన్నప్పుడవి కాలగర్భమున గలసిపోక ముందే యుద్ధరించుటకు పెద్దలెవ్వరు పూనుకొనరే యనెడు తహతహపడుటదక్క అసహాయుడనగు ఒంటిమానిసిని చేయదగిన దేదియునులేదు. ఇక ప్రస్తుతము పల్లె పాటలలోనున్న కొన్ని ఆయుర్వేద విషయములు తెలుపుటయే నాయీవ్యాస ముఖ్యోద్దేశ్యము.

ఈ పాటలలో సంపటి ముహూర్త శాస్త్ర విషయము లుండుననని నాకు తొలుదొలుత తెలియులేదు. ఒకప్పుడు నేను సేకరించిన పాటలను కీ. శే. శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారికి చూపించితిని. విషయమునుబట్టి పాటలనన్నింటిని కొన్ని తరగతులుగా విభజించి యుంటిని. పిల్లల పాటలలో కొన్నింటికి అర్థ ముండని మాట వాస్తవమైనను అర్థముండి నాకు తెలియనివానినిసైత మా తరగతిలో చేర్చివేసితిని. రెడ్డిగారు నేనర్థము లేవనుకొన్న పాటలకు గంభీరమైన యర్థమున్నదని మచ్చునకొకపాట దీసికొని నిరూపించిరి. తక్కినవాని వివరణము లకు 'ప్రజామిత్ర' 1939 సంక్రాంతి సంచికను చూడుమనిరి లేదా ఆయుర్వేద శతావధాని శ్రీమాన్ తిరుమల రామానుజస్వామిగారిని దర్శించుమనిరి. నేను వల్లె యుంటిని. ఆచార్యులవారు తాము 6-5-1940 'గోలకొండ'లో ప్రకటించిన వ్యాస మొకటి నాకు దయచేసిరి. ఆ వ్యాసమున నొక్కపాటకే వివరణమున్నది. ఆచార్యులవారి 'ప్రజామిత్ర' వ్యాసము లభింపలేదు. అందు చాల విషయము లున్నవట. పాఠభేదములతో నున్న నాదగ్గరి పాటలకు శ్రీమాన్ ఆచార్యుల వారిని అర్థమడిగితిని. వారు దయతో నా కాపాటలందున్న ఆయుర్వేద రహస్య ముల నెరిగించిరి. కొన్నిపాట లుదహరించి వానిలోనున్న శాస్త్రవిషయముల తేట మొనర్తును.

ఆడపిల్లలిద్దరు పరస్పర మొకరి కుడిరొడమ చేతులతో నింకొకరి రొడమ కుడిచేతులు పట్టుకొని ఇరువురి కాళ్ళొక కడజేర్చి ఒకరికొకరెదురువడి, భూమి నరళరేఖగా 45 డిగ్రీలు వెనుకకువంగి, తమచేతుల పట్లూతగానిలిచి గిరగిర తిరిగె దరు. దీనినే 'బిత్తి' తిరుగుట యందురు. ఇది కన్యలకు చక్కని వ్యాయామము. ఇది ప్రస్తుతము (Skipping) అనుదానికి తావిచ్చినట్లున్నది. దేశదౌర్భాగ్యము. బిత్తితిరుగుచు పాడెడు పాట లెన్నియో కలవు. వానిలో నొకటి

"ఒప్పులకుప్పా - ఒయ్యారిభామా
మినపాపప్పూ - మెంతీపిండీ
తాటీబెల్లం - తవ్వేడునెయ్యీ
(తగుదగు)
గుప్పెడుదింటే - కులుకూలాడీ
నడుమూగట్టీ - నామాటబట్టీ"

ఈపాటలో స్త్రీల కుపయుక్తమగు 'చిట్కా' యున్నది. ఇటువంటిదే పురుషుల కొఅకు.

"ఒప్పులకుప్పా - ఒయ్యారిభామా
నన్నాబియ్యాం - చాయాపప్పూ
(మినపాపప్పూ - మెరికాబియ్యం)
పాలునెయ్యాడి - పాశంవొండూ
నీమొగడుదంటే - ఆనందమంటే"

ఈ రెండు పాటలును స్త్రీ పురుషులకు వేర్వేరుగా చెప్పబడిన వాజీకరణ యోగములు. వీని కనుకూలించు చరకసంహితా సూత్రములు, ఔషధవివరములు ఆచార్యులవారు గోలకొండలో ప్రకటించినారు. ఆ వ్యాసముననున్న పాట ఇది యొక్కటే. ఇంకను కొన్ని పాటల కర్థములు వారు ప్రజామిత్రయందు వ్రాసిరట. అవి లభించలేదు. ఇక నేనుసేకరించి వారివారినుండి యర్థమెఱిగిన పాటలు కొన్ని పేర్కొనెదను.

"కాళ్ళగజ్జి - కంకాలమ్మ
వేగుచుక్క - వెలగమొగ్గ
మొగ్గకాదు - మోదుగనీరు

నీరుకాదు - నిమ్మలవాయ
వాయకాదు - వాయంటకూర
కూరగాదు - గుమ్మడివండు
వండుకాదు - పాపడమీసం
మీసంకాదు - మిరియాలపోతు
పోతుకాదు - బొమ్మలశెట్టి
శెట్టికాదు - శామలమన్ను
మన్నుకాదు - మంచి గంధపుచెక్క
లింగులిటుకు - చందెమూపటుకు
కాలుఎండినట్లు - కడకుదీసిపెట్టు.''

ఇదికూడ పిల్లల ఆటపాటయే. దీనిలో పిల్లలకు జానువులపై చేతివెడల్పుతో లేచి చాల బాధపెట్టు గజ్జికి మందున్నది. ఈ గజ్జిపుండు డన్వుడప్పుడు మానుచు పొక్కుచు నీరుకారుచు పిల్లలను వారికన్న నెక్కువగా తలిదండ్రులను బాధ పెట్టును. ఈ పాటలోనున్న కొన్ని పదముల కర్థము సాధారణముగా నెవ్వరికిని తెలియదు. గ్రామీణాయుర్వేద పరిభాష నెరిగినవారికిగాని ఈ పాట కర్థము తెలియదు. తెలంగాణము పల్లెపట్టులందు తెలుగు, తెనుగు, బోయవారను నొక జాతివారున్నారు. గ్రామరక్షణము, వేట, తేనెనమ్ముట, మూలికలపెంచుట వారి వృత్తి. ఔషధములకు కావలసిన మూలికలను, వస్తువులను గ్రామీణాయుర్వేద వైద్యులకు వారే తెచ్చిపెట్టుదురు. ఆదిమాంధ్ర శబ్దమును రాజకీయనేత్తలు హరిజనులకు వాడుచున్నారు. పొరపాటేమో! నిజముగా నాదిమాంధ్రు లీ తెలుగువారని నా యభిప్రాయము. వీరి నడిగిన కంకాలమ్మ, వేగుచుక్క, వెలగమొగ్గవంటి శబ్దముల కర్థము చెప్పెదరు. ఈ పాటకు రెండు మూడు పాఠాంతరములున్నవి. ఏపాఠమైనను మొదటి మూడు వస్తువులను మాత్రము తప్పక పేర్కొనును. అవి ముఖ్యద్రవ్యములు. ఆ తరువాతివన్నియు పర్యా మ్నాయములే. కంకాలమ్మ = కచూరాలు, వేగులచుక్క (సరియైన రూపము) = బావంచాలు, వెలగమొగ్గ = పాదరసము, ఈ మూడును ముఖ్య వస్తువులు. ఇందులో పాదరసమునకుమారుగా నెన్నియో ప్రత్యామ్నాయములను సూచించినాడు. "మొగ్గకాదు - మోదుగనీర''నగా పాదరసమునకు బదులు మోదుగచెట్టునుండి తీయు నీరును వాడవచ్చునని యర్థము. (ఈ నీరుతీయు పద్ధతి

ఆయుర్వేద రసాయన భాగమునకు చెందినది. మోదుగనిరెట్లు తీయవలెనో ఆచార్యులవారు నాకు విపులముగా చెప్పిరి.) ఆ నీరు లభింపకున్నచో నిమ్మల వాయ = నిమ్మపులుసు వాడవచ్చును. అది కానిచో వావింటరసము, నీరుడు గింజల తైలము, మోదుగమాడ, మిరియములు, మజ్జిచిగుళ్ళు, లోహరజము, మంచిగంధపు చెక్క-వంటి క్రమముగా సూచింపబడిన వస్తువులలో నేదేని యొక వస్తువు నుపయోగించుకొనవచ్చును. పై వస్తువులను శరీర ప్రకృతి ననుసరించి వాడవలయును. నిమ్మపులుసు, వావింటరసము, మిరియములు మున్నగునవి శోధన ద్రవ్యములు. మంట మండకుండుటకై మంచిగంధపు చెక్క-వంటి చల్లని వస్తువులను చెప్పినాడు. ఈ మూడు వస్తువులను బాగుగ మర్దన చేయవలయును. లింగు లిటు కనునది మర్దనకు ధ్వన్యను కరణము. పటుకనగా కాఠిన్యము ఏమాత్రము లేకుండ పందెము వేసినట్లు మెత్తగా నూరవలెనని యర్థము. అట్టి యౌషధములను కాలునకు పుండుపై కట్టవలెను. నయమైన తరువాత నాకట్టును "కడకుతీసి పెట్ట" వచ్చును. ఈ యోగమునకు సోమరాజి (బావంచాలు), శశికల యనిపేరు. పూర్వమెప్పుడో పత్రికలో చదివి ఈ మందును వాడినందున తమపిల్లల కారోగ్యము కలిగినట్లు శ్రీ పింగలి వెంకటేశ్వరరావు గారు (మడికొండ) నాకు చెప్పిరి.

ఇంకొకపాట.

"చెమ్మచెక్క - చేరెడేసిబుక్క
అట్లుపోయంగ - ఆరగించంగ
రత్నాల చెమ్మచెక్క - రంగులేయంగ
పగడాల చెమ్మచెక్క - పందిరేయంగ
పందిట్లబాలుడు - పరుగులెత్తంగ."

ఈ పాటలో వయసువచ్చినను సమర్త కానివారికి (మాచకమ్మలకు) సంతానము కలుగనివారికి 'చిట్కా' యున్నది. చెమ్మచెక్కను చెమ్మచెక్కగా చదువుకొనవలెను. చెమ్మయొక్క చెక్క చెరడును బుక్కవలెనట. తెలంగాణమున బుక్కుట యందురు. యూనియన్ ఆంధ్రులు బొక్కుట యందురు. జేరెడనగా చేతికి వచ్చునంత కాదుసుమా! ఆయుర్వేదమున చులుకము, బిడాలపదకమను పరిమాణము కలదు. అంగుష్ఠము, అనామికము, మాధ్యమికము ఈ మూడు వ్రేళ్ళతో నెత్తెడు పరిమాణమే బిడాలపదకము. దీనినే అరచేతిగుంటలో నిముడు

నంత పదార్థము లేక చేరెడందురు. రత్నాల చెమ్మయనగా నెత్తిపూలు బూయు చెమ్మ. ముత్యాలచెమ్మ యనగా తెల్లపూలు గాయు చెమ్మ. మొదటిది రజస్వల కానివారికి, రెండవది సంతానము లేనివారికి చెప్పబడినవి. ఈ పాటను జానపద సాహిత్యమున సాంకేతిక వాదమునకు (Symbolism) ఉదాహరణముగా తీసికొన వచ్చును. 'రంగులేయంగ' అనునది రజస్వలకును 'ముగ్గులేయంగ' అనునది అభివృద్ధి, సంతానాభివృద్ధికిని సంకేతముగా గ్రహింపవలెను. సంతానము కలిగిన తరువాత పగడాలు = కెంపులు, వజ్రాలు = వజ్రాలపై గట్టెడు పాలవెల్లి కావలసినదేకదా! "పండట్ల బాలుడు - పసుపులెత్తంగ" కలిగెడు ఆనంద మనుభవైకవేద్యము. ఈపాట నిద్దరు బాలికలు (కన్యకలుకూడ) ఒకరి కొకరభిముఖులైయుండి వారివారి కుడివైపులకు గూడ నెడమవైపులకు కలియుచు చేతులు తట్టుచు పాడెదరు. ఈయాటనే "చెమ్మ చెక్క" యందురు.

ఇంకొకపాటలో (Accidental) ఆగంతుకముగ భగ్నాస్థిచికిత్స సూచింపబడినది. ఇదికూడ పిల్లల పాటయే.

"కొండమీద వెండిగిన్నె
కొక్కిరాజు కాలువిరిగె.
దానికేమందు?
వేపాకుచేదు - వెల్లుల్లిగడ్డ
నూనమ్మబొడ్డు - నూటొక్క ధార"

ఈ పాట సాధారణముగా కచ్చకాయ (గచ్చకాయ) లాటలో పాడెదరు. కచ్చకాయలాడెడు సమయమున (ఒక్కొక్కప్పుడు గుండ్రని కాళ్ళతోగూడ నాడుటచేత) వ్రేళ్ళు బెణికిరియో మరెందువలననో ఎముకలు విరిగెడు అపాయ ముండునని కావచ్చు, వెంబడే చికిత్సకై పాటలో మందును సూచించినారు. పాటలో మాత్రము కొక్కిరాజుకు కాలు విరిగినట్లున్నది. ఎట్లున్ననేమి, భగ్నాస్థి చికిత్స మాత్రము నిశ్చయము. వేపాకుచేదు, కుమ్మలో నుడికించిన వెల్లుల్లిగడ్డ ("భగ్నాస్థి సంధానకరో రసోనః") నిమ్మబొడ్డు (నూ + నిమ్మబొడ్డు = దానిమ్మ బొడ్డును కలియనూరి భగ్నాస్థిపై వేసికట్టి నూటొక్కసారి కుండనీరు పోయవలెను.

పై పాటలన్నింటికిని పాఠాంతరము లున్నవి. 'కాళ్ళగజ్జె' పాటలో పాదరసమునకు ప్రత్యామ్నాయముగా చెప్పబడిన వస్తువుల పట్టిక కొన్ని

పాటలలో పొడవుగా నున్నది. కాని ముఖ్యసూత్రముమాత్ర మన్ని పాటలలో నొక్కటే. ఈ పాటలకు కేవలము సూచనమాత్రముగా నర్థము చెప్పనైనది. ఏ యేవస్తువు నెంతెంత పరిమాణముతో వాడవలయునో వివరముగా వ్రాసిన నీ వ్యాస మాయుర్వేద గ్రంథమగును. ఇటువంటివే పిల్లల పాట లెన్నియో యున్నవి. వానియందద్భుతములగు విషయములు గుప్తముగా చెప్పబడినవి. ఉదాహరణకు "గుడుగుడు గుంచం" "కొంగ కొంగ గోళ్ళు" మొదలైనవి. మొదటిదానిలో తేలు పాముకాటులకు చికిత్స యున్నది. రెండవదానిలో కునఖ చికిత్స (జెష్ట, గోరుచుట్టు) కలదు. ఇదంతయు బాలసాహిత్యమే.

ఇక పెద్దవారు పాడెడు పాటలలోనున్న విషయముల కొన్నింటిని దిఙ్మాత్రముగా సూచింతును. మానుకోట తాలూకా గుర్తూరు గ్రామములో నేను సేకరించిన ఒక తత్వములో పాముకాటునకు చికిత్సయున్నది. తత్వపు రెండవ చరణముననే చికిత్స యున్నది. కనుక మొదటి రెండుచరణములే యుటంకింతును.

"చావదూర ఈ పాము - చప్పిడి చద్బలాపు ||చా||
భావించి వైరాగ్యమానే - బడితే నెబ్బబడిగాని ||చా||
మాచికాయరసము - బీసారివేరూ దెచ్చి
కాచీపోసినగాని - కావార గుణగాదు" ||చా||

మాచికాయ, బీసరివేరు రసములను కాచిపోసినచో పాము విషము విరుగునట. ఎంత సులభసాధ్యములైనవీ యౌషధులు !

ఇంతకు పూర్వము 'స్రవంతిలో' నేను ప్రకటించిన రెండవ వ్యాసములో సతీపతుల సంవాద మొక్కటి పేర్కొంటిని. జారిణియగు భార్య తన విటుని మంచముక్రింద దాచియుంచెను. భర్తగా రావటునిచూచి 'మంచం క్రిందీవాడు ఎవ్వాడె భామా' యనెను. అప్పుడా వగలాడి తప్పించుకొనుటకై యొకసాకు కల్పించినది.

"పక్కఇంట్లుండేటి - పడుసుపిల్లోడు
పిల్లికి తలనొస్తే - నల్లికొచ్చిండు
నాతోడు రంకాడ లేదు - నీతోడు రంకాడ లేద"

ని సమాధాన మిచ్చినది. అబద్ధమాడినను జారిణి అద్భుతమైన యౌషధమును మన కందించినది. నల్లినిచంపి దానిరక్తమును వాసనచూచినచో పిల్లికేకాదు మనుష్య

లకు గూడ (Aspro) కన్న మంచిగా శిరోవేదన మణగిపోవును. ఈ యోగము నాకనుభవము.

1952 జనవరిలో మా గ్రామమున (మడికొండ) 'వేసంగి' వరినాటు వేయించుచుంటిని. అప్పుడు మా 'తెగచేయు' హరిజనుని యింటిది పాడిన దొక "నాగన్నపదము" వ్రాసికొంటిని. అది దీర్ఘగేయము. ఇచ్చటమాత్ర మవసరమైన భాగమునే యుదహరింతును. పాటయందున్న విషయమిది. ఒక చెల్లెలు తన అన్నగారికి పొలముకడకు 'దూపకు' తీసికొనిపోయి తిరిగి వచ్చుచుండగా మధ్య మార్గమున నాగుబాము 'కరెగొటికినది'. ఆబాధతో నామె యింటికి చేరుకొను నప్పటికే విషము దేహమంతట వ్యాపించిపోయినది. పొలముకడనున్న యన్న గారి కీవార్త చేరినది. ఆతడువచ్చి

"తూరుపుబోయినీ - తుమ్మేరుదెచ్చి గొబ్బిల్ల, గొబ్బిల్ల
పడమట బోయినీ - పాలేరుదెచ్చి ,,
దచ్చినంబు బోయినీ - దంతేరుతెచ్చి ,,
ఆయేరు ఈయేరు - కాల్వొడ్డునగడిగి ,,
కాల్వొడ్డున గడిగినీ - కలరోటవేసీ ,,
కలరోటవేసినీ - రోకండ్లగుమ్మి ,,
రోకండ్లగుమ్మినీ - బట్టల్లబెట్టీ ,,
బట్టల్లబెట్టినీ - గన్నెల్లపిండీ ,,
పిడుకల్లు గొట్టినీ - తంపుల్లుబెట్టీ ,,
తుకతుక ఉడికించి - మీగడలగలిపి ,,
పట్టిపట్టి పోయంగ - పానాలెపాయె ,, "

తుమ్మ, పాల, దంతె వేరుల రసముడికించి మీగడతో కలిపి త్రాగించిన పాము విషము విరుగునని ఈ పాటలోని భావము. ఆలస్యమైనందున కావచ్చు పాట మాత్రము విషాదాంతముగా ముగిసినది. నాగుబాము ఒక్క-కాటువేసి ఊరకుండ దాయెను. 'కరెగొటికినద'ట పాపము! ఐనను నకాలమున నీ చికిత్స చేసినచో లాభించెడిదేమో!

రావులమ్మ, రాములమ్మ పేరుతో నొక దీర్ఘ గేయము పిచ్చుకుంట్లవారు పాడుచుండగా విని వ్రాసికొంటిని. రామాయణమున సీతాపహరణము, శ్రీరామ

విరహము, సీతచెర, రావణ సంహారము, అగ్నిప్రవేశమున్నట్లే రాములమ్మ పాటలో నొక లంబాడివాడు రాములమ్మయను నొక కావు గేస్తురాలిని మోసగించి ఎత్తుకొని పోవుటయు, రాములమ్మ భర్త మున్నగువారు వలువాము లంది చివరకు లంబాడివానిని చంపుటయు రాములమ్మ అగ్నిప్రవేశమును కలవు. కాని రామాయణమునకును రాములమ్మ పాటకును నించుకంత భేదము చివర విషయమున నున్నది. అగ్నిప్రవేశ మొనర్చిన సీత దేవత కనుక (మహాకవుల దయవలన) బ్రదికినది. రాములమ్మ మాత్రము కాలిపోయి దేవతయైనది. బహుశః ఈ ఘటన నల్లగొండ మండలమున జరిగియుండును. ఆ మండలమున రాములమ్మ రాములయ్య యను పేళ్ళెక్కువగా పెట్టుకొనుటయే నాయూహ కాధారము. ఈ కథలో లంబాడివాడు రాములమ్మను మోసగించువట్ల మచ్చు మందులును, ఆమెకు కడుపునొప్పి నయముచేయుపట్ల శూలకై చికిత్సయును కలవు. ఉదాహరించిన కొలది వ్యాసము పెరిగిపోవునను భయముతో విరమించు చున్నాను.

ఇటు లెన్నియో శాస్త్రవిషయముల పూర్వుల యనుభవములు మన పల్లె పాటలలో నిమిడియున్నవి. భారతీయ విజ్ఞాన మిట్టి వింతరూపములతో తరతర ములనుండి మనకందించుచున్న పూర్వులబుద్ధి వైభవమును పొగడినచో కొంద అపాశ్చ్యదృక్కులకు నచ్చదు. ఈ పాటలు వారికి మోటుగా నగుపడును. వాస్తు జ్యోతిష విషయములున్న పాటలు సేకరించిన బాగుండును. అచ్చంపేట ప్రాంతీయులు సారస్వతాభిమాను లీపనికి బూనుకొనిన శ్రేయోదాయకము.



# మొగలు చిత్రకళ - 2

—••—

## శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

ప్రాచీన భారతీయ సంప్రదాయముపై నాధారముచేసి పర్షియన్‌రీతి సాంగత్యమున పరిణామముచెందిన మొగలురీతి చిత్రకళ పదునాఱవ శతాబ్దమున అక్బరుపోషణవలన సుస్థిరముగ నెలకొని పదునేడవ శతాబ్దమున జహంగీరు కాలమున ఉత్తమదశ నొందెను. తండ్రివలెనే తానుకూడ జహంగీరు చక్రవర్తి చిత్రకళకు సమగ్రపోషణ నొసంగెను. కావుననే ఈ చిత్రకళ బాగుగ నభివృద్ధి చెంది అతనికాలమునందు పరిపక్వస్థితికి వచ్చెను.

**జహంగీరు నైజము:**

జహంగీరు చక్రవర్తి రాజపుత్రరాణి తనయుడైనను మతవిశ్వాసమునందేమి, అభిరుచులయందేమి మంచిచెడ్డలన్నిటియందును మొగలు సంప్రదాయమునే అనుసరించువాడు. తనతండ్రి అక్బరు గుణములకన్న ప్రపితామహుడగు బాబరు చక్రవర్తి గుణదోషములే ఇతనియందు దెక్కువగ గాన్పించుచున్నవి. బాబరు వలెనే ఇతనికిని పుష్పములన్న అమితమగు ప్రీతి. ఉద్యానవనములను ఏర్పాటు చేయించుట వీరికి ఉభయులకును సంతోషకరమైనపని. ప్రయాణముచేయుట-ముఖ్యముగ సుందరములగు ప్రకృతి దృశ్యములు గాన్పించు ప్రాంతములందు ప్రయాణముచేయుట—వీరి కిరువురికిని చాలా ఇష్టము. అందువలననే కాబోలు వేటయనిన ఉభయులకును ఇష్టమే. సంగీత సాహిత్యములందు ఉభయులకును అభిరుచియేకాక కొంత రచనా సామర్థ్యముకూడ ఉండెను. గ్రంథరచనయందు ఇరువురును ప్రసిద్ధులే. ఇక మద్యపానమునందు ఇరువురును అగ్రగణ్యులే.

ఇన్ని పోలికలుండినను జహంగీరునకుమాత్రము బాబరు చక్రవర్తికుండిన పౌరుషము, స్థైర్యము, శ్రమసాధ్యములగు దుష్కార్యముల నాచరించుటయందు పట్టుదల మొదలగు గుణములు లేకుండెను. యౌవనమునందు కొంతకాలముదప్ప ఇతనియందు పురుషలక్షణములకన్న స్త్రీ సహజమగు మార్దవము, దౌర్బల్యము అధికముగ గాన్పించుచున్నది. చపలబుద్ధియుకూడ ఇతనియందలి దోషములలో

నాకటి. ("There can be no dealing with this king upon sure terms, who will say and unsay, promise and deny") "నిలకడగ ఇతనితో ఏ వ్యవహారమును చేయసాధ్యముకాదు. ఇప్పుడుచెప్పి ఇంతలోనే కాదనును. వాగ్దానముచేసి మరుక్షణములోనే వీలుకాదనును" అని అతని స్నేహితుడే ఒకడు వ్రాసియున్నాడు. ఒకరోజు తన ఏనుగులు చన్నీళ్ళలో స్నానముచేయుచుండగా చూచి "పాపము, చలి" అని వగచి మరియొకనాడు తాను వేటాడుచుండినపుడు అజాగ్రతగ వచ్చినందున పిట్టలును, చిన్నచిన్న జంతువులును బెదరిపోయెనని కోపించి తన పరిచారకులను ఇరువురుని చిత్రవధ చేసెను. ఒకమారు తన ప్రజలని హిందువులమతమును, ఆచారవ్యవహారములను సహనముతోచూచి పండితులతో సంప్రదించుటకుకూడ అంగీకరించువాడు. ఒక సందర్భమున దుర్భరమైన మత ద్వేషమును గనుపఱచి విగ్రహారాధన రూపుమాపుటయె పరమాదర్శముని పరిగణించి విగ్రహధ్వంసమొనర్చి వరాహవిగ్రహమును ఖండములుగజేసి పుష్కర తటాకమున పాఱవేయించెను.

జహంగీరుయొక్క స్వభావమునుబట్టియు, గుణదోషముల వైఖరినిబట్టియు అతని పోషణవలన వృద్ధిజెందిన మొగలు చిత్రకళయందు కొన్ని విశిష్ట గుణములును, విచిత్రపద్ధతులును నెలకొనెను. విశిష్టగుణములలో చిత్రకళా కౌశల్యమును, విచిత్ర శాస్త్రనైపుణ్యమును, చిత్రరచనా విధానమును ప్రశంసింపక తప్పదు. అక్బరుకాలమునాటికిని, జహంగీరు కాలమునకును ఈ విషయములందు ఎంతో అభివృద్ధి కాంచనగును. అక్బరువలె చిత్రకళను గురుముఖతః అభ్యసింపక పోయినను జహంగీరు చిత్రకార విద్యాధురంధరుడనియు, చిత్రకళయందు రసాస్వాదనాశక్తి గలవాడనియు చెప్పక తప్పదు. ఒక చిత్రమును పలువురు చిత్రకారులు కలసిమెలసి పనిచేసి నిర్మించినను ఆచిత్రమునందే యేభాగమును ఏచిత్రకారుడు రచించెనో చెప్పగల సామర్థ్యము కలవాడని తానే తుజుకీ జహంగీరి (Tuzuk i-Jahangiri) అను స్వీయచరిత్రమునందు చెప్పుకొనినాడు. ఇది ఉత్ప్రేక్షయనియు, తనమాటను ఎదిరింపజాలని చిత్రకారులఎదుట ప్రగల్భములు పలికి ఆత్మస్తుతి చేసికొనుట ఏమంత గొప్పవిషయము కాదనియు పెర్సీ బ్రౌను (Percy Brown) అను దొరగారు వక్కాణించి యున్నారు. కాని రాజాధిరాజైన జహంగీరునకు తన చిత్రకళా నైపుణ్యమును చాటిచెప్పుకొనవలయుననెడి కాంక్షయే అతని చిత్రకళా రసాస్వాదనాశక్తికి తార్కాణము. చిత్రకారులకు

తానొసంగిన గౌరవస్థానమునుబట్టియు తన చిత్రకారులనుగూర్చి సగర్వముగ చెప్పుకొనుటనుబట్టియుకూడ ఇతనికి చిత్రకళయన ఎంత అభిమానమో తెల్ప వచ్చును. చిత్రకారులు వెంటరాక ఇతడు ప్రయాణమును సాగించువాడుకాడు. వేటకు బయలుదేరినను, యుద్ధమునకు బయలుదేరినను కూడ తన అభిమత చిత్రకారులు వెంటరావలసినదే. ఏ ప్రదేశమునందైననుసరే చక్కని చిత్రరచనకవకాశముండినయెడల తప్పక చిత్రరచన సాగింపవలసినదే.

ఒకమారు జహంగీరు యుద్ధమునకై బయలుదేరెను. దుస్సహ గ్రీష్మతాపమునకు వెఱువక రాజపుత్ర స్థానమునందలి మండుటెడారులలో రాత్రింబవళ్ళనక ప్రయాణముచేసి పదునాకండు రోజులలో సుమారు ఆరువందలమైళ్ళు దాటిపోయి సర్నల్ (Sarnal) యుద్ధభూమియందు రణరంగ మొనర్చెను. ఈ ప్రయాణమునందు తనవెంటవంటి రావలసివచ్చిన సన్వల్ దాస్ (Sanwal Das) జగన్నాథ్ (Jagannath) తారాచంద్ (Tara Chand) అను ముగ్గురు చిత్రకారులును ఎట్టి శ్రమకోర్చి తనయుద్ధచాతుర్యము మెలగిరో, రణరంగమును అత్యద్భుతముగ చిత్రించిన సన్వల్ దాస్ (Sanwal Das) ఎట్టి దైహికబాధ ననుభవించెనో వజ్రకాయుడగు జహంగీరునకు మనసున నాటలేదు.

తనవలెనే తన పరివారముకూడ కాయకష్టములకోర్చి తమసామర్థ్యములను చూపవలెనని ఇతని అభిప్రాయము. కాని కొందరు చిత్రకారులయెడ ఇతడు చూపిన ఆదరాభిమానములు ప్రశంసనీయములు. అబుల్ హసన్ (Abul Hasan) అను చిత్రకారుని ఇతడు పుత్రభావముతో జూచుటయేగాక తన స్వీయ చరిత్రమునందీరీతిగ వర్ణించియున్నాడు. "నేనితనిని (అబుల్ హసన్ చిత్రకారుని) పెంచి పెద్దజేసినందున నాకితనితో ఎక్కువ సంబంధముకలదు. శైశవమునుండియు నేనతనిని పోషించి అతని కళావైదుష్యము ఈ ఉత్తమస్థితికి వచ్చుటను గాంచగల్గితిని. అతడు నిజముగ యుగపురుషుడే అని చెప్పవచ్చును. (My connection was based on my having reared him. From his earliest years up to the present time. I have always looked after him, till his art has arrived at this rank. Truly he has become Nodir-uz-Zaman (the wonder of the age )

తనమెప్పువడసిన ఉత్తమచిత్రమును సంపాదించుటకై ఈ చక్రవర్తి ఎంత ధనమునైనను వ్యయముచేయువాడు. బెజాద్ (Bihzad) అను సుప్రసిద్ధ

పర్షియాచిత్రకారుని చిత్రములను నాల్గింటిని జహంగీరు శ్రమపడి సంపాదించెనట. సుమారు క్రీ॥ శ॥ ౧౪౯౯ యందు చిత్రింపబడిన ఆ చిత్రములు జహంగీరునాటికే కడుదుర్లభము లాయెనట. వానివిలువ సుమారు పదునైదువందల రూప్యములని జహంగీరు స్వయముగ నిర్ణయించెనట. యూసఫ్, జులైఖాఖు (Yusuf and Zulaikha) అను బైబిలులోని గాథ ఇతివృత్తముగాగల ప్రాచీన కావ్యమొకటి ముల్లా మీర్ ఆలీ (Mulla Mir Ali) అను లిపికళాకారుడు రచించిన గ్రంథమును జహంగీరు సంపాదించెనట. దీనివిలువ ఆనాడు వెయ్యిమోహరీలట. ముద్దులు మూటగట్టినట్లుండు లోకోత్తరమైన లిపియు, అందుకు తీసిపోని చిత్రములును, చక్కని బంధనకర్మయు (Binding) కలిగి అన్నివిధములగను ఈ గ్రంథరాజము జహంగీరు చక్రవర్తి హృదయమును ఆకర్షించెనట. కాని అంతకన్నను ఉత్తమమైనది ఖలీల్ మిర్జా (Khalil Mirza) అను ప్రాచీన చిత్రకారుడు రచించి అతని హస్తాక్షరములతో విరాజిల్లుచున్న చిత్రమట. ఈ చిత్రరాజమును తానెంత శ్రమపడి సంపాదించెనో ఈ చక్రవర్తి స్వయముగ వర్ణించియున్నాడు.

జహంగీరు సేకరించిన చిత్రములు — అవి గ్రంథములలో మధ్యమధ్య ఉదాహరణప్రాయముగ రచించినవైననుసరే లేక వేర్వేరుగ రచింపబడిన ప్రకృతి దృశ్యములు, జీవాలేఖ్యములు మొదలైన మామూలు చిత్రములైననుసరే—అతని చిత్రకారులను స్పర్థాళువులుగ జేసెననుటలో సందియము లేదు. అందునను చక్రవర్తి స్వయముగ చిత్రములను పదేపదే పరిశీలించుటయేగాక చిత్రరచననుగూర్చియు, చిత్రములందలి తారతమ్యములనుగూర్చియు చర్చించుటనుబట్టి నాటి ఆస్థాన చిత్రకారులు తమ హస్తకౌశల్యమును పెంపొందించుకొనుటకు ఎంతేని శ్రమకు వెనుదీసియుండరు. ఎట్టిసందర్భమునైనను, ఎట్టి దృశ్యమునైనను చిత్రింప వెనుదీయక చిత్రకర్మ సాగించినవారు హస్తకౌశల్యమున ఎవరికిని దీసిపోరని చెప్పుటలో అతిశయోక్తి ఎంతమాత్రమును కానరాదు. వారిశిక్షణ అసామాన్యమైనదనియు, సాటిలేని వారి నైపుణ్యమువలన ఏరీతిచిత్రమైననుసరే ప్రపంచమునందెట్టి ఉత్తమచిత్రకారునివలన రచింపబడినదైనను, వారు నకలు తయారుచేసిన రెండింటిలో మాతృక ఏదో, నకలు ఏదో చెప్పుట దుస్సాధ్యమనియు, నాడు జహంగీరు సామ్రాజ్యమునకు వర్తకముకొరకై రాయబారమువచ్చిన సర్ థామస్‌రో (Sir Thomas Roe) అను ఇంగ్లీషుదొర చెప్పియున్నాడు.

ఒకనాడు జహాంగీరు చక్రవర్తి తన చిత్రకారులు ఎట్టి ఉత్తమచిత్రము నైనను యథాతథముగ అనుకరించి నకలు తయారుచేయగలరని వక్కాణించెనట. సర్ థామస్‌రో తాను యూరపునుండి తెచ్చిన ఒకటిరెండు ఉత్తమ చిత్రములను ఎవరును అనుకరింపజాలరని మనవిచేయగా జహాంగీరు పంతమువేసి కొన్ని గంటలలో ఆ యూరపు చిత్రములలో ఉత్తమమైనదానికి ఒకదానికి ఐదుగురు చిత్రకారులచేత ఐదునకలులు వ్రాయించెనట. సర్ థామస్‌రో అతికష్టముపైన మాతృక ఏదో, నకలుఏదో గుర్తింపగల్గెనట. యూరపు చిత్రకళా నైపుణ్యము నాటిమొగలు చిత్రకారులకు ఏమంత దుస్సాధ్యముగ గన్పించలేదనుటకు ఈ నిదర్శనమొక్కటే చాలును.

జహాంగీరు పోషణయందు ఖ్యాతిగడించినవారిలో మన్సూరు (Mansur) అనునతడుముఖ్యుడు. ఫరూక్ బేగ్ (Farrukh Beg) అను కాల్మక్(Kalmuck) ప్రాంత చిత్రకారుడుకూడ జహాంగీరు దర్బారునందు గొప్పస్థానమును సంపాదించుకొని అబ్దుల్ సమద్ (Abdul Samad) తరువాత ఈ చిత్రకార బృందమునకు నాయకుడాయెను. మహమ్మద్ నాదిర్ (Mahammad Nadir) మహమ్మద్ మురాద్ (Mahammad Murad) అను విదేశచిత్రకారు లిరువురును మధ్యఆసియా సమర్ఖండు (Samarkand) ప్రాంతమునుండివచ్చి జహాంగీరు దర్బారు నలంకరించిరి. కాని మొగలు సామ్రాజ్యమున మనదేశమునకు వచ్చిన విదేశ చిత్రకారులలో వీరే కడపటివారని తోచుచున్నది. బిషన్‌దాస్ (Bishen Das) మనోహర్ (Manohar) గోవర్ధన్ (Govardhan) అనువారు కూడ ఆనాడు ఉత్తమ చిత్రకారులే.

వీరందరికన్నను ఆనాడు గొప్ప ప్రాముఖ్యత సంపాదించిన చిత్రకారులు ఆగారిజా (Aga Riza) యును, అతనిపుత్రుడు అబుల్ హాసన్ (Abul Aasan) అను చిత్రకారుడును. అబుల్ హసన్ (Abul Hasan)' నదిర్ ఉజమాన్ (Nadir-u-Zaman) "యుగవైచిత్ర్యము" (Wonder of the Age) అను బిరుదమును సంపాదించుకొనెను.

జహాంగీరు కాలమునాటి చిత్రములందు వర్ణములఉజ్జ్వలతకన్న ప్రశాంతతయే ప్రస్ఫుటముగ గన్పడును. చిత్రమునందు వివిధవర్ణములు ఒకదానిలోనికొకటి కలిగి కలసిపోయినవాయనిపించును. రేఖావిన్యాసమునందుకూడా

ఈ చిత్రములలో ఒక వైశిష్ట్యము గాన్పించుచున్నది. ఈ చిత్రములు చాలా వరకు జహంగీరు జీవిత సందర్భములనే ప్రదర్శించుచున్నవి. కాని అతనికి జంతువులయందును, పక్షులయందును మిక్కుటమగు ప్రేమ యుండెను. కాబట్టి మన్సూర్ (Mansur) మొదలగు చిత్రకారులు పశుపక్ష్యాదులను చిత్రించుట యందు అసమాన కౌశలమును సంపాదించిరి.

చిత్రరచనా పద్ధతియందే కాక చిత్రకారుని లక్ష్యమునందుకూడ జహంగీరు కాలమున మార్పువచ్చెను. లోకోత్తరవీరులగాథలను చిత్రించి లోకాతీత విషయములను ప్రదర్శించుటకన్న దైనందిన జీవితమున గాన్పించు అందచందములకు రూపుకట్టి ప్రదర్శించుటయే చిత్రకారుని పరమాదర్శమని జహంగీరు కాలమునందు గాన్పించుచున్నది. ఈ యభిప్రాయమును దనియాల్ (Daniyal) రాకుమారుడు స్పష్టముగ ఈ రీతిగవక్కాణించెను. "లైలామజ్నూ, దీపపు పురుగులు, కోకిల మొదలైనవాటిని గూర్చిన పాతకథలు విని మాకు విసుగు జనించినది. మనము స్వయముగ చూచి వినినవాటినే ఇతివృత్తములుగ గ్రహించి కవులును, చిత్రకారులును రచనలను సాగింపవలెను (We are tired of wearisome tales of Laila Maznun, the moth and the nightingale. Let the poets and artists take for their subjects what we have ourselves seen and heard)"

జహంగీరుకాలమునం దేర్పడిన ఈ వాస్తవికతాదృష్టి (Realism) కొంత వరకు పాశ్చాత్యకళా ప్రభావమువలనకలిగినదని ఒకవాదము కలదు. పాశ్చాత్యులు ఈ వాదముపై కొంచెమధికముగ ఆధారపడియున్నారు. ఇటీవల ఫేబర్ గ్యాలరీ ఆఫ్ ఓరియంటల్ ఆర్ట్ (Faber Gallery of Oriental Art) అను గ్రంథమాలయందు ప్రచురితమైన మొగల్ పెయింటింగ్ (Mughal Painting) అను నొక చిన్ని పొత్తమున జె. వి. యస్. విల్కిన్సన్ (J. V. S. Wilkinson) అను దొరగారు ఈరీతిగ వ్రాయుచున్నారు. "అతడును (అక్బరును) అతని తనయుడు జహంగీరును ఇరువురును, మతసంబంధమైన చిత్రములను, మామూలు చిత్రములనుకూడ ఆదరముతో స్వీకరించి తమ హర్మ్యప్రాసాదములను ఈ చిత్రములతో నలంకరించుచుండిరి. తరువాత జహంగీరువద్దకు మొదటి జేమ్సు (James I) పంపిన రాయబారి సర్ థామస్ రో (Sir Thomas Roe) ఒక విషయమును కనిపెట్టెను. చిత్రములను ముఖ్యముగా యూరపు

చిత్రకారుల చిత్రములను సేకరించి ఇచ్చినయడల జహాంగీరుయొక్క గాఢ స్నేహమును సంపాదింపవచ్చునని ఇతడు కనిపెట్టెనట. దర్బారునందలి సామంతులు పెద్దలుకూడ పాశ్చాత్య చిత్రకళయందు రాజననుసరించి రుచి మరగిరి. ఇందునకు ప్రోద్బలముపైనుండి వచ్చినను భారతీయులలో అన్ని వర్గముల వారికిని విదేశీయరీతి బాగుగ నచ్చెనని చెప్పుటకు సూచనలున్నవి.

Both he (Akbar) and his son Jahangir welcomed as presents religions and secular pictures with which they used to adorn their palaces. Later Sir Thomas Roe, James the First's Ambassador to Jahangir, discovered that there was no surer method of cultivating his intimacy than by procuring him pictures, especially portraits by European artists. The court nobles followed, and no doubt shared, the taste of their sovreign for western painting. There are indications, further that though the impetus came from above, the foreign style appealed to Indians of all classes."

ఉత్ప్రేక్షాతిశయోక్తులతో గూడిన పైవాదము చాలవరకు నిరాధారమని చెప్పవచ్చును. పాశ్చాత్యకళ మొగలుదర్బారునందు నూతనాంశము కాదని ఒప్పుకొనకతప్పదు. ఒక్క పాశ్చాత్యకళయేకాక సమగ్ర వైభవోపేతమై ప్రపంచమునం దెవ్వటను సాటిలేని మొగలు దర్బారునందు లోకోత్తరమైన కళలు, విద్యలు, శాస్త్రములు, వింతలు, వినోదములు మొదలగునవి ఎన్నియైనను కొద్దిగనో, గొప్పగనో ప్రదర్శితములగుచునే యుండెను. ఆ ముష్మిక సంబంధము కలవియును, కేవలము బుద్ధిబలమునే ప్రదర్శించునవియును కొంతపోషణ లేక కృశించినను, ప్రాపంచికములైన విద్యలును, ఇంద్రియాకర్షకరములైన విజ్ఞాన విభాగములును ఎవ్వియైననునరే, అవి ఏదేశమునుండి వచ్చినను కొంత స్థానమును సంపాదించుకొనుచుండెను. అట్టిచో పాశ్చాత్య చిత్రకళకూడ మొగలు దర్బారునందు కొంతవరకు ఆదరాభిమానములకు పాత్రమాయెననుటలో ఆశ్చర్యము లేదు.

కాని పాశ్చాత్యకళకు మరికొంత ఎక్కువస్థానము కలుగకపోవుటకు కారణము ఆ కళను మొగలు దర్బారునందు ప్రవేశపెట్టిన వారి అసమర్థతయే. వీరు చిత్రకళాభిజ్ఞత కలవారుకారు. కేవలము క్రైస్తవమతమును పెంపొందించు

నుద్దేశ్యముతోనో, లేదా వ్యాపారలాభములను సంపాదించుటకుగానో చక్రవర్తికి ఏవో కొన్ని బహుమతులను సమర్పించుటకు పూనుకొని వారు తమదేశములనుండి కొన్ని చిత్రములనుదెచ్చి భారతదేశమున ప్రవేశపెట్టిరి. కాబట్టి అట్టిచిత్రములను జూచి అవి క్రైస్తవమతసంబంధము కలవైనయడల సర్వమతాభిమానముకల అక్బరును, తదనుయాయులును, కొంత గౌరవమును జూపిననుకూడ అంత మాత్రముచేతనే భారతీయులు పాశ్చాత్య చిత్రకళాసౌష్ఠవమునకు అచ్చెరు వొంది గౌరవమును ప్రదర్శించిరనుటకు సాధ్యముగాదు.

నిష్పాక్షికముగ పరిశీలించినచో మొగలు చిత్రకళపై పాశ్చాత్య చిత్రకళా ప్రభావ మెంతమాత్రమును గానరాదనియు, అనుస్యూతముగను, పారంపర్యము గను వచ్చుచున్న భారతీయ చిత్రకళా పరిణామము మొగలు చక్రవర్తుల పోషణవలన కొన్ని మార్పులకు లోనైనను తనప్రత్యేకతను ఎంతమాత్రమును గోల్పోలేదనియు విశదమగును. ఈ యంశమును పాశ్చాత్యవిమర్శకులే ఒప్పు కొనినట్లు పైనపేర్కొనిన విల్కిన్సన్ (T. V. S. Wilkinson) దొరగారి సంగ్రహ పుస్తకమున గలదు. "అజంతాయందు పరిమాణమును జూపించుటకు చేసిన ప్రయత్నములును, భారతీయ శిల్పమునందు తప్పనిసరిగ జంతుప్రదర్శన మున గాన్పించు వాస్తవికతయు, పరిశీలించినయడల చిత్రలేఖనమునందు లోతును జూపించుటకును, భౌతిక పరిమాణమును వ్యక్తముచేయుటకును కోర్కె గల్గుటకు కారణము బహుశః భారతీయ శిల్పసంప్రదాయమై యుండుననియు, భౌతిక వస్తువులను గుండ్రముగను, భౌతిక పరిమాణముగలవిగను పరిగణించు అలవాటుకూడ ఇందుకు కొంతవరకు కారణభూతమై యుండవచ్చుననియు తోచుచున్నది." (In the light of such considerations as the traces of modelling at Ajanta and the persistently close realism of Indian anineal sculpture, it seems at least possible that the Indian sculptural heritage and the habit of viewing objects in the round may have had something to do with cultivating a desire to express depth and volume in painting)

మొగలు చిత్రకళయందు సర్వప్రాధాన్యత జీవాలేఖ్యములకును (Potraits) నిదర్శనాత్మక చిత్రములకును (Illustrations) ఒసంగినందున భౌతికమైన సాదృశ్యమును, వాస్తవికతయును ఇందు ముఖ్యముగ గాన్పించును.

మానవచిత్రములయందు మానవత్వము, మున్నగు ఆంతరంగిక విశేషములకన్నను, ఆత్మనివేదనము మొదలుగాగల విశిష్టభౌతికేతర గుణములకన్నను కూడ వ్యక్తి గతమైన స్వభావ చిత్రీకరణము ఎక్కువగ గాన్పించును.

మొగలు చిత్రకళకంటె కొంచెము ప్రాచీనమైన గుజరాతీ రీతి చిత్రకళ యందును, సుమారు మొగలు చిత్రకళతో సమకాలీనమని చెప్పనగు రాజస్థానీరీతి చిత్రకళయందును పైనుడివిన ఆంతరంగిక భౌతికేతరగుణములే ప్రధానము గాన భౌతికమైన రూపసాదృశ్యమునకు ఈ చిత్రకారులు అంతప్రాధాన్యత నివ్వలేదు. అందువలననే గుజరాతీ, రాజస్థానీ రీతుల చిత్రకళయందు రూపప్రదర్శన యధా తథముగ లేదనియు, వాస్తవికతకు కొంతభంగము వాటిల్లినదనియు పాశ్చాత్య సంప్రదాయమునకు లోబడిన విమర్శకులు తరుచు వాదించుచుందురు.

వ్యక్తిత్వమునందును, వ్యక్తి ప్రత్యేకతయందును హైందవచిత్రకారుని దృష్టి లగ్నముకాలేదు: కాని అవిద్యచే నానాత్వము గాన్పించు బాహ్య ప్రపంచము నందుసూక్ష్మదృష్టితోను, ఆంతరంగిక దృష్టితోను ఏకత్వమునుగుర్తించి భిన్నభిన్నములుగ దృగ్గోచరము చేయుచున్న క్షణిక జ్ఞానము నతిక్రమించి భిన్నరూపముల ప్రత్యేకతను చిత్రించుటకుబదులు సమీకరణ దృష్టిచే భిన్న రూపములను వర్గీకరణమొనర్చి వేర్వేరు జాతులుగ నేర్పరచి, జాతులప్రత్యేకతను మాత్రమే ప్రదర్శించుట హైందవ కళాసంప్రదాయము.

జహంగీరునకు మతమునందుకాని పారలౌకికవిషయములందు కాని ఎట్టి శ్రద్ధయులేకుండెను కాబట్టి భౌతికేతర విషయములందు ఎక్కువ ప్రవేశ ముండు టకు సాధ్యముగాదు. చిత్రకళ ఇంద్రియతృప్తికి సాధనముగబరిగణించినమొగలు చక్రవర్తులును, నాయకులును భారతీయసంప్రదాయమునందలి రచనావిధాన మును మాత్రమే గ్రహింపగల్గిరి. కాని చిత్రకళయొక్క పరమప్రయోజనమును అవగతము చేసికోనజాలరైరి. అందువలననే ముచ్చటగొల్పు చిత్రములనెన్ని టిని తయారుచేయగల్గినను మొగలు చిత్రకారులు తమ ఉత్తమ దశయందుకూడ చిత్రకళయొక్క పరాకాష్ఠనొంద జాలరని చెప్పనలవికాదు.

# తమిళ సాహిత్యము

—○○○○○—

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

తమిళ సాహిత్యమున ప్రథమదశయందు గాన్పించు గ్రంథములు ప్రథమ సంఘ యుగపువని చెప్పెదరు. కొందరుకవులు కలిసి ఒక సంఘముగనేర్పడి ఉన్నత సాహిత్య నిర్మాణమును చేసిరనియు వారి తర్వాత కొంతకాలమునకు సారస్వతము, విజ్ఞానము క్షీణదశజెంది మరల విజృంభించి రెండవసంఘ యుగ మేర్పడెననియు ఈరీతిగా మూడు యుగములు కలవనియు చెప్పుచున్నారు. కాని మొదటి రెండు సంఘముల సాహిత్యము నేడు చాలవరకు కానరాదు. మొదటి సంఘము "మధుర" యనెడు పట్టణమున చాలకాలము విలసిల్లి యుండెననియు ఆ పట్టణము నేడు గాన్పించు మధుర గాక హిందూ మహాసముద్రమున మునిగి పోయిన ఒక గొప్ప భూభాగమునందుండెననియు తెలియుచున్నది. అగస్త్యుడు మొదటి రెండు సంఘముల యుగములందునుగూడ ప్రశస్తిగాంచినట్లు తెలియు చున్నది. గాని యితడు రచించిన గ్రంథములుకాని యీ రెండవ సంఘపు ఇతర సారస్వత గ్రంథములుకాని కావరావు. ఈ సంఘము "కపాటపురము", "అలైవాయ్" అను గొప్ప పట్టణమునందుండెననియు అచట గొప్ప గ్రంథాలయ ముండెననియు అందు ఎగిళా గ్రంథములుండెననియు ఇవన్నియు సముద్రమున మునిగిపోయెననియు లోకములో వాడుక కలదు. నాటి గ్రంథములలో "తోల్ కాప్పియం" అనెడి వ్యాకరణ గ్రంథ మొక్కటియే దక్కినది.

ఇంచుమించు నేడు గాన్పించుచున్న ప్రాచీన తమిళ గ్రంథములన్నియు మూడవసంఘము నాటివే. ఇవి ప్రధానముగ యుద్ధమునుగూర్చియు గొప్పగొప్ప వీరుల కృత్యములనుగూర్చియు ప్రశంసించెడి ఖండకావ్యము లనవచ్చును. మతము, మోక్షము, సుఖము, ప్రాపంచిక సంపత్తి మొదలగు కోర్కెలకన్న కీర్తికాంక్షయే యెక్కువగా ప్రాచీన తమిళుల యాదర్శమై యుండెనని యీ వాఙ్మయమువల్ల తెలియుచున్నది. ఉదాహరణముగ పురనానూరు అను గ్రంథము నందు "ముత్తుకణ్ణన్ సాత్తాన్" అనెడి "ఉరయూర్" కవి 'నలన్‌కిల్లీ' అని

చోళరాజును సంబోధించి చెప్పిన పద్యములు పేర్కొనవచ్చును. వీర్యము, శౌర్యముతోపాటు దానము, భూతదయ మొదలైన గుణములుకూడ ఈ ప్రాచీన తమిళ వాఙ్మయమునందు ప్రశస్తికెక్కినవి. అందువలననే శిబిచక్రవర్తిగాధ ప్రాచీన తమిళ వాఙ్మయమునందు ఉన్నతస్థానమును వహించినది.

"అహనానూరు" అను గ్రంథమునందు పై లక్ష్యమునకు భిన్నమైన శృంగార సంబంధమగు నాదర్శము ఎక్కువగా కాన్పించుచున్నది. ప్రాతివ్రత్యమునకు ఒసగిన ఏకైక గౌరవస్థానము కొంతవరకు క్షీణించి భౌతిక సౌందర్యము ప్రియుల అన్యోన్యానురాగములు మొదలగునంశములు క్రమక్రమముగా నెక్కువ స్థానము నాక్రమించినట్లు "తోల్‌కాప్పియం" వలన తెలియుచున్నది. కాని ముఖ్యముగా "కలిత్తొగై" అను పద్యావళినుండి యీ యాదర్శము స్పష్టమగుచున్నది.

సంఘయుగములతర్వాత ప్రసిద్ధిగాంచిన "తిరువళ్లువర్" అను కవి క్రీ. శ. మొదటి రెండు శతాబ్దులయందు "పాండినాడు"ను పరిపాలించిన "ఉగ్రిపాండ్యుని" చోళ సింహాసనము నధిష్ఠించి రాజసూతయాగమును గావించి ప్రసిద్ధికెక్కిన "పెరునర్‌కిల్లి" అను నతనిని కేరళదేశమును పరిపాలించిన "చేరమాన్‌మావంగో" అను నతనిని ప్రస్తావన జేసియున్నందున నితడును ఆ కాలమువాడేయని తెలియుచున్నది. బహూశా "అవ్వయ్యార్, విడుమాన్‌అంబి" మొదలైనవారుకూడ ఆనాటివారలోయేమో "తిరువళ్ళువర్" జీవితమునుగూర్చి మన కెక్కువగా తెలియరాదు కాని యతని గ్రంథము "తిరుక్కురల్"ను పరిశీలించినయెడల ఇతనికి సమగ్ర విద్యా విజ్ఞానములేకాక రాచరికమునందుగూడ గొప్ప అనుభవము, సామర్థ్యమును ఉండినట్లు తెలియుచున్నది. "తిరుక్కురల్" గ్రంథమునందు మూడవ అధ్యాయము ప్రేమశృంగారము మొదలైన విషయములనుగూర్చి ప్రస్తావన చేయుచున్నది. ఇది తమిళ సారస్వతములో అత్యున్నతస్థానము నాక్రమించినది. మద్రాస్ మాజీ ముఖ్యమంత్రి శ్రీమాన్ చక్రవర్తుల రాజగోపాలాచార్యులు తిరుక్కురల్ నందుగల అపారమైన ప్రేమచేత ఆ గ్రంథమును ఆంగ్లమునందు భాషాంతరీకరించినారు.

"శిలప్పదికారం", "మణిమేఖలై" అను రెండు కావ్యములును తమిళ వాఙ్మయమునందు భారతరామాయణములవలె ఇతిహాసములుగ ప్రఖ్యాతిగాంచి

వవి. "శిలప్పడికారం" లోని కథ కోవలన్ కణ్ణకి కథారూపముగ అంద రెరిగినదే. ఈ కథ తమిళ నాటకరంగమునందును సినిమాలలోను ప్రచారము గాంచినది. ఈ కథతోనే తెలుగులో "పత్ని" యనుపేర నొక సినిమా ప్రకటితమైనది. ఈ గ్రంథమును రచించినవాడు "ఇలన్ కో ఆదిగళ్" అను పేరుగల కవి. ఈ గ్రంథమునందు ప్రస్తావింపబడని విజ్ఞానవిషయమేలేదని తమిళుల విశ్వాసము. ఈ గ్రంథమునుబట్టి నాటి విశిష్ట సంగీత సంప్రదాయము నేటి కర్ణాటక సంప్రదాయమునకన్న ప్రాచీనతమమైనదేకాక మిక్కిలి ప్రశంసా పాత్రమనికూడ తమిళసంగీతజ్ఞుల యభిప్రాయము.

మణిమేఖలై గ్రంథము "కోవలన్, కణ్ణకి" అను వారల తలిదండ్రులను గూర్చియు "కోవలన్" ఉంపుడుగత్తె యయిన "మాధవి" ని గూర్చియు ఆమె కూతురయిన "మణిమేఖలై"ని గూర్చియు తెలియజేయుచున్నది. వేశ్యాపుత్రిక యైనను "మణిమేఖలై" తత్వజిజ్ఞాసయే పరమావధిగ పరిగణించి వివిధ మతాచార్యుల ధర్మబోధల నాలకించి పరిశీలించి చివరకు బౌద్ధధర్మము నవలంబించెనని యీ గ్రంథమునందుకలదు. దీనినిబట్టి "సాత్తానార్" అను ఈ గ్రంథకర్త బౌద్ధమతాభిలాషియనియు, నాడు బౌద్ధము అరవదేశమునందు వ్యాప్తిలోనుండె ననియు చెప్పవచ్చును.

ఏడవ శతాబ్దివరకును మరల తమిళ సాహిత్యమునందు ఎట్టివిశేషములను గావ్పించవు. కాని పల్లవుల పరిపాలనక్రింద తమిళుల రాజకీయ ఆర్థిక వైజ్ఞానిక బలమతిశయించి సారస్వతమునందు సంస్కృత సాంగత్యమున ఉత్కృష్టతను గాంచిన గొప్ప గ్రంథములు వెలువడినవి. "కావేరీ పూంపట్టినం" అను రేవు పట్టణము నేడు సముద్రమున మునిగిపోయినను నాడు విదేశవ్యాపారమునకును సాహిత్యగోష్ఠికిని రంగస్థలమని ప్రశస్తిగాంచి యుండెను. "అప్పర్, జ్ఞాన సంబంధర్" అను శైవమతాచార్యులును. "పాయిహై ఆళ్వార్" మొదలగు వైష్ణవమతాచార్యులును ప్రసిద్ధిగాంచి హిందూమతోజ్జృంభణమునకేకాక తమిళ సారస్వత వికాసమునకుగూడ పునాదులు వేసిరి. అరవశతాబ్ది చివరికాలమునందు పాండ్యుల ప్రభావము విజృంభింపసాగెను. నాడు "జ్ఞానసంబంధర్" బాల్యదశ మందియే భవత్సాక్షాత్కారముపొంది, శిష్యకోటి కేవలము భగవదంశ సంభూతుడుగ

గావ్పించి తనభక్తి గేయములచేత వారిని తన్మయులజేసే నాడు ప్రశస్తిగాంచిన 'అప్పర్' కూడ ఇతని మహత్వమును గుర్తించెననియు ఇతని శిష్యులలో కొందరు హరిజనులు, కొందరు బ్రాహ్మణులునుగూడ నుండిరనియు తెలియు చున్నది. పాండ్యరాజు నాస్థానమున జైనులనోడించి శైవమును స్థాపించినది యితదేనట. "అప్పర్, జ్ఞానసంబంధర్" ఈ యిరువురును రచించిన భక్తి గేయములు ఏడు అధ్యాయములలోగల తేవారం అనెడు ఉత్తమ గ్రంథముగ నేడు కావ్పించుచున్నది.

సుమారు ఈకాలమునందే "పెరియాళ్వార్", అతడుపెంచిన "ఆండాల్" అను విరువురును తమరచనలచేత భక్తిమార్గమును. వైష్ణవమతమును సుస్థిరముగ స్థాపించి తమిళ వాఙ్మయ చరిత్రయందొక విశిష్టభాగమును ఏర్పరచిరి.

"మాణిక్కవాసగర్, తిరుమంగై ఆళ్వార్, కులశేఖరాళ్వార్" మొదలగు వారెందరో తర్వాతి కాలమునందు ఈ సంప్రదాయమునే అనుసరించి తమిళ సారస్వతమున కొక వినూత్న శోభ నొనగూర్చిరి.

చోళయుగమునందు, అనగా సుమారు క్రీ. స. ౧౧-౧౨ శతాబ్దులందు తమిళదేశము చారిత్రక ప్రఖ్యాతి గాంచెను. నాడు దక్షిణాపథమున చాలా భాగము చోళసామ్రాజ్యము క్రిందికి వచ్చుటయేకాక ఖండాంతరము లందుకూడ ముఖ్య ముగా నేడి ఆగ్నేయాశియాలో చాలా భాగమున చోళుల రాజకీయ ప్రభావము నకును, సంస్కృతి ప్రచారమునకును లోనయ్యెను. నాటి సారస్వతమునందు "సెక్కిళర్" వ్రాసిన "పెరియ పురాణము" "కంబర్" వ్రాసిన 'రామాయణము' మొదలగు పౌరాణిక గ్రంథములేకాక "బుద్ధమిత్రన్" వ్రాసిన "వీరశోళియము" "జయంకొండన్" వ్రాసిన "కళింగట్టుప్పరణి" మొదలగు చారిత్రక గ్రంథము. లును, "ఒట్టకూత్తన్" వ్రాసిన "ఉళా" అనబడు ఖండకావ్యములును ప్రధాన ముగ కావ్పించుచున్నవి. "పవనంది" వ్రాసిన "నన్నూల్ అను తమిళవ్యాకరణము కూడ ఈ సందర్భమున పేర్కొనకతప్పదు. "జీవక చింతామణి" అను గ్రంథము "క్షత్రచూడామణి" అను సంస్కృత గ్రంథము నాధారముగ గొని వ్రాయబడినను మహా మహాకావ్యముగ పరిగణింపబడి తమిళుల మన్ననకు పాత్రమైనది. కాని యీ గ్రంథములన్నిటిలో కంబరామాయణము ఉత్తమ స్థానము నాక్రమించి

వాల్మీకి రామాయణమునకు తుల్యముగ కొందరు భావించుచున్నారు. దీనిని చిత్తూరు వాస్తవ్యులు శ్రీ శ్రీరాములురెడ్డిగారు తెలుగులో పద్యకావ్యముగ భాషాంతరీకరించి తమిళ తెలుగు సాహిత్యములకు సామరస్యమును కల్పించినారు,

మధ్యయుగమునాటి తమిళ సారస్వతమునందు కల్పితముకన్న తత్త్వశాస్త్రము వేదాంతము మతము ఎక్కువగా గాన్పించుచున్నది. నాటి పండితులు "శివజ్ఞానబోధం" అను గ్రంథమును రచించిన "మెయికండాన్" వలె తత్వజిజ్ఞాసయందు దృష్టిని కేంద్రీకరించి శైవ సిద్ధాంతమును స్థాపించిరిగాని తమిళ సారస్వతమునందు ఏమంత గొప్ప అభివృద్ధిని తీసికొని రాజాలరైరి.తమిళ సారస్వతమున నెట్టి యభివృద్ధియు నిటీవలివరకును కానరాదు.

పాశ్చాత్యులు మనదేశమునకు వచ్చుట కారంభించిన పిదప "ఫాదర్ బెపీ" మొదలగు క్రైస్తవమత ప్రచారకులు తమిళమునందు క్రైస్తవమత గ్రంథములను రచించి క్రైస్తవ తమిళ వాఙ్మయమునకు పునాదులు వేసిరి. "ఒమర్" మొదలగు మహమ్మదీయులుగూడ ఇస్లాం సంబంధమగు గ్రంథముల నెన్నింటినో తమిళ భాషయందు రచించిరి. తాయు "మానవర్" వంటి కొందరు కవులు హిందూ మతమునందలి వివిధ శాఖలకు సామరస్యమును కుదిరించుటకు బద్ధకంకణులై వేదాంతమునకును, శైవసిద్ధాంతమునకును ఏమంత భేదము లేదనియు, సామ్యమే యెక్కువ కాన్పించుచున్నదనియు చాటి చెప్పినను తమిళ సారస్వతమునకు వీరి సేవ అంతయు యధికముగా కాన్పించదు.

గత శతాబ్దియందు రామలింగస్వామి అను భక్తుని గేయములు ఎక్కువ ప్రశస్తిగాంచినను వచన వాఙ్మయమునకు పునాదులు వేసిన "ఆర్ముకనావలర్" మొదలగు గ్రంథకర్తలే యెక్కువ ప్రాముఖ్యమును గాంచిరి.

ఇటీవల ప్రపంచ ఖ్యాతిగాంచిన సుప్రసిద్ధ రచయితలలో "సుబ్రహ్మణ్య భారతి" తమిళ సారస్వతమునకు ప్రపంచ భాషలలో నొక విశిష్ట స్థానమును సంపాదించెను. నేటి రాజకీయ వాతావరణమునందు ఇతనికి రాజకీయముగ గొప్ప ప్రాముఖ్యము గాన్పించుచున్నను ఇతనికి రాజకీయములకన్న కృష్ణప్రేమయందును శక్తిప్రభావమునందును, మతాభిమానమునందును ఎక్కువ ప్రేమయున్నట్లు కాన్పించుచున్నది. ప్రాంతీయతా దృష్టియందును, వర్ణవివాదములందును ఇత

వికి ద్వేషభావమంకురించి సంకుచిత భావములేని విశ్వమానవ సౌభ్రాతృత్వమును, సౌహార్ద్రమును పరమలక్ష్యముగ నితడు బోధించెను.

నేడు స్వాతంత్ర్యప్రాప్తి ఫలితముగ సర్వతోముఖముగ భారతదేశమందలి వివిధప్రాంతములను విజృంభించుచున్నందున సారస్వతప్రపంచమునందుగూడ నొక నూతనవికాసము గావ్పించుచున్నది. తమిళసారస్వతము సుబ్రహ్మణ్యభారతి వేసిన పునాదులపై నుత్తమ వికాసముగాంచి కావ్యములందు, నవలలయందు, నాటకములయందు, సంగీతప్రధానములగు కీర్తనలు, కృతులు మొదలగువానియందును సమగ్రాభివృద్ధిని గాంచియున్నది. నేడు మద్రాసు ఆస్థాన తమిళ కవియగు "నాయకర్" రామలింగంపిళ్లె ఇప్పటి తమిళ సారస్వత ప్రపంచమున ప్రఖ్యాతిగాంచిన కవి, స్వతంత్రభారతపద్యరచనచేసి యీయన భారతదేశ స్వాతంత్ర్యోద్యమములో త్యాగమొనర్చిన మహాపురుషుడు. ఆధునికులు నవలలు, నాటకములు, కథలు వ్రాయువారనేకులు వెలయుచున్నారు.

గల్పిక

# "తప్పెవరిదంటావ్"

రచన: ప్రకృతి

"చక్రాల బడ్డీమీద - చక్రాల బండీమీద యినుప కుంపటిపెట్టీ, దానిమీదే; కారప్పూస, పకోడీలు, పచ్చిమిరపగాయలూ, బజ్జీలు మొదలైన నాలుగు [illegible] పిండివంటలకు పాళ్ళు కలుపుకునీ, ఆ కుంపటిమీద యిరవైరోజులనాటి మడ్డినూనె - మురుగువాసనకొట్టేది; మరగపెట్టి; వాటిని వండి అమ్ముతుంటాడ్నే వాడికి రోజుకు మూడురూపాయలు అమ్మకం ఉంటుంది"—

"ఆ మూడు రూపాయల అమ్మకంలో వాడికి లాభంగా మిగిలేది వో రూపాయి!!"

"వాడింట్లో - వాడి చేతికింద బతకవల్సినవాళ్ళు, వాడితో కలుపుకుని - రొంతోమంది లేరులే; కొద్దిగా రెండుచేతులూ కలుపుకో; పది!

"ఆ పదిమందిలో ఆరుగురు పిల్లలు, నలుగురు పెద్దవాళ్ళు, ఆ నలుగురిలో వాడి అమ్మా, బాబూ కూచున్నచోటినుంచి కదల్లేని ముసలివాళ్ళు - యికపోతే వాడిపెళ్ళాం వడ్లదంపుకు వెడుతూంటుంది. పనిదొరికినపూట వో మూడు పావలాలు తెస్తుంది. లేనినాడు - చెమటలుపట్టి వాడిపోయిన మొఖంతో, చింకిరి తలతో, కాళ్ళీడ్చుకుంటూ వస్తుంది.........

"అయితే - వాడిదగ్గర రోజూ సాయంత్రపువేళ నడివయసు తురకవాడొకడూ, హిందూవొకడూ చెరోప్రక్కనుంచీవచ్చి తలొక పావలా టెఫినూ తిని ప్రభుత్వం యేర్పరచిన కుళాయినీళ్ళతో ఆకలి తీర్చేసుకుంటారు. "కార్లషెడ్డులో పనిచేసే ఆతురకవాడు సంపాదించేది వాడి తాగుడుకే చాలదు - జనపనార మిల్లులోపనిచేసే యీ హిందువు తెచ్చేది, రోజుకు వొకపూటతాగే గంజికైనా చాలదు.

"అదితప్పు??" అన్నాడు మిత్రుడు.

'కాదని యెవరన్నారు- అవును తప్పే.'

'—మరి??'

'...మరి'

'పెళ్ళాంపిల్లల్నీ,ముసిలివాళ్ళనూ పోషించు కోడానికి వీడు-యీచక్రాల బడ్డీ షాహుకారు—అవిచేసి అమ్మడం తప్పంటావా—చాలీచాలని కూలి తెచ్చుకుంటూ; ఆదారంటపోయే కిర్సనాయిలూ, సారాలారీలు మించివచ్చేవాసనా, బుయ్‌వుయ్ మంటూ పోయేకార్ల పెట్రోలు దుర్గంధాలతో, రోడ్లమీదిదుమ్ముతో కలిసి మిళితమై పోయిన పిండినివండగా గవులుకంపూ, గబ్బుకంపూ, మురుగు వాసనావేస్తూ తయారయ్యే ఆఫలహారాలను తినే ఆకూలీవాళ్ళది తప్పంటావా??'

'............!!'

'—పోనీ ఆ ఫలహారాల బడ్డీ పక్కనుంచి వస్తూ,' అమ్మో ! 'చచ్చాను!!' అంటూ ముక్కుమూసుకున్న నీదితప్పంటావా??'

'ఊహుc......అసలూ...'

'అదే......ఇందాకనేగా నువు సిగరెట్లకి రూపాయి మార్చావు; వో అర్ధణా వెయ్యి, ఆముష్టాడికి—కుష్ఠుతో ఛస్తున్నాడు. కుంటివాడు—వీడువొకప్పుడు ఆజనపనారమిల్లులో కూలీగానే వుండేవాడు...!'

'ఏం—అలా తేరపారిచూస్తావ్'

'............'

'............'

'............'

'బండబారిపోయి వాళ్ళుచేసే ప్రతిపనివెనుకా, వాళ్ళకుంటి బ్రతుకులు చూడు వొకసారి—. మేడ, దానిఅంతస్థులూ, అలాగ శోభతో నిలిచివుండడానికి పునాదిరాయిలా తోడ్పడుతుందో, అలాగనే వీళ్లూ—వీళ్ళ కాయకష్టం లోకగమనానికి తోడ్పడుతున్నవి...కానీ—'

'............'

'—తప్పెవరిదంటావ్???!'



హిందీనాటిక

# సుడిగుండం



శ్రీ ఉపేంద్రనాధ అష్క్

## మొదటి రంగం

ప్రతిభ గది. అదేడ్రాయింగు గది. చదువుకొనే గదికూడా. ఆ గదిలో కూర్చోడానికి ఒక సోఫాసెట్టూ, చదువుకొనేటందుకు కుర్చీ, డ్రాయరూ ఉన్నవి. డ్రాయరుమీద టెలిఫోను. బీరువాలో అందంగా పుస్తకాలు. పైన పంఖా నెమ్మదిగా తిరుగుతుంటుంది.

గదిలో మూడు దర్వాజాలూ, ఒకకిటికీ వాటికి అందమైన డోర్ కర్టెన్లూ వేలాడుతూ ఉన్నవి.

ప్రతిభ వయస్సు ఇరవైఐదు సంవత్సరాలు. అందమైన కళ్ళు. అంత పొడుగూకాదు, పొట్టీకాదు. యం. ఏ. చదివే రోజుల్లో దర్శన శాస్త్రోపాధ్యాయుడు

శైలాభుని ప్రేమించింది. కాని ఆ ప్రేమ విజయం పొందలేదు. కారణం శైలాభునికి అలాంటి భావం లేకపోవడమే. మొదటిరోజుల్లో అతడొక విద్యార్థినిని వివాహం చేసుకొన్నాడు. ఆ వివాహంతో అతనికి ఎంత కటు అనుభవం కలిగిందంటే ఆమెను ఏదోవిధంగా వదలించుకొని స్త్రీజాతి అంటేనే ఏవగించుకొనే స్థితిలో పడ్డాడు. అతని ఏవగింపు ప్రతిభ ఆకర్షణకు కారణమయింది.

విధిలేక ప్రతిభ తన సహాధ్యాయుడైన సురేశుని ప్రేమించడం ప్రారంభించింది. సురేశుడు ఎంతకాలంనుండో ఆమెను ప్రేమిస్తున్నాడు. సురేశుడు మంచి టెన్నిసు ఆటగాడు. అందమైనవాడు. ఐశ్వర్యవంతుడు. ప్రతిభ సురేశుణ్ణి వివాహం చేసుకొన్నది. వివాహమయిన ఆరునెలలలోనే తనుచేసినపని తప్పని గ్రహించింది. విడాకులిచ్చి విముక్తిని పొందింది.

ఇదిజరిగి సంవత్సరమయింది. సురేశుడు శకుంతలఅనే ఇంకొక పిల్లను వివాహమాడాడు.

ప్రతిభ సోఫామీద పడుకొని ఉంటుంది. తెరలేచిన తరువాత అలసిపోయినట్లుగా వొళ్ళు విరుస్తుంది.

ప్రతిభ: అబ్బా!...ఈ జీవితం ఎంతశూన్యంగా ఉన్నది!! సహాయం పొందుదామన్నా, ఆలంబనంగా చేసుకొందామన్నా గట్టి వస్తువే కనపడడంలేదు! (చేతుల్ని వదులుగా వదిలిపెడుతుంది. అవి ధప్పని వొళ్లోకి వచ్చిపడతవి. దాసీని పిలుస్తుంది) మందా! మందా!!

మందాకిని: (లోపలినుండి) ఆ! వస్తున్నా. (తెరబయటకు వస్తుంది)

ప్రతిభ: ఆ కిటికీని తెరువు.

(మందాకిని కిటికీ తెరుస్తుంది)

ప్రతిభ: (లేచి కిటికీ దగ్గరకుపోయి బయటకు చూస్తుంది) బయట మేఘాలు కమ్ముకొని వస్తున్నవి. ఇక్కడ ఆకాశం శూన్యంగా ఉన్నది.

మందాకిని: నన్ను పిలిచారు. ఎందుకో?

ప్రతిభ: ఎందుకూలేదు. నిమ్మకాయ షర్బతు ఒకగ్లాసు తీసుకొనిరా.

మందాకిని: ఇప్పుడేగదా భోజనం చేశారు...

ప్రతిభ: ఎదురుచెప్పకు. చెప్పినపనిచెయ్యి.

మందాకిని: చిత్తం. (వెళ్ళిపోతుంది)

(వెనకనుండి ప్రతిభతండ్రి రామనారాయణ కంఠధ్వని వినపడుతుంది.)

**రామనారాయణ:** శరభం! సైకిలు తుడిచి బాగుచేశావా? ఆఫీసుకు తొందరగా పోవాలి. టెక్నికల్ యూనిట్ మీటింగుకు హాజరవాలి. ఆ ఫైలు సైకిలు క్యారియరుకు కట్టు. (ప్రవేశించి) ఈ యుద్ధంమూలాన విసుగు పుట్టి పోతున్నది. పెట్రోల్ దొరకడంలేదు. ఈ సైకిలుమీద బయలు దేరితే ఆలస్యమయిపోతున్నది. పైన ఒకటేదుమ్ము. దరిద్రపు బుతు వసలు ఇది. ఎండలు మండిపోతున్నవి. సైకిలుమీద ఆఫీసుకుపోవాలి— చావుగా ఉన్నది. (వెళ్ళిపోతాడు.)

**ప్రతిభ:** ఆఫీసూ ఫైళ్ళూ! పాపాకు అవిరెండుతప్ప ఇంకో ప్రపంచమే లేదు. (దువ్వెనతో) పాపిడి సరిచేసుకొంటుంది)

(లోపలినుండి ప్రతిభ తల్లి కంఠధ్వని)

**తల్లి:** ఈ మందాకిని ఎక్కడకు పోయిందో? డిన్నరుకు పదార్థాలు తయారుచేయాలి.

**ప్రతిభ:** (సోఫామీద కూర్చుంటుంది) లంచ్, డిన్నర్! మమ్మీకి ఇవిరెండూతప్ప ఇంకో ప్రపంచమేలేదు. లంచ్ నుండి బయటపడలేదు. డిన్నరు గందరగోళం ప్రారంభమయింది. ఇక ప్రతిమా ప్రమీలలు......

(ప్రతిమ విద్యుద్వేగంతో ప్రవేశిస్తుంది. పద్ధెనిమిది సంవత్సరాలు వయస్సు. యఫ్. ఏ. విద్యార్థిని. సౌందర్యవతి. చంచలస్వభావం. ప్రేమాన్నిలో తను ఆహుతిఅయి, ఇతరులను ఆహుతిచేసే సర్వగుణాలూ ఆమెలో మూర్తీభవించి ఉంటవి.)

**ప్రతిమ:** అక్కా! అక్కా! చూడు. ఈ వస్తువులు బాగున్నవేమో!! మీల తన టాయిలెట్ బాక్స్ చూసుకొని చాల ఉప్పొంగిపోతున్నది. ఈ లిప్ స్టిక్ చూడు. ఇది పౌడరు. ఇది ఫౌండేషన్‌లోషన్. ఇది ఐబ్రోపెన్సిల్. (చిరునవ్వు నవ్వుతుంది) అన్నీ ఫస్టుక్లాస్ వస్తువులు. మీల చాల ఉడుకుతుంది. (వచ్చినంత వేగంగానే వెళ్ళిపోతుంది)

**ప్రతిభ:** హద్దులేదు. టాయ్‌లెట్ చేసుకొనడంతప్ప ఇంకొకవిషయం తీర్చుకు తోచదే!

(తెరలోనుండి హార్మోనియం ధ్వని వినపడుతుంది. పాట)

యహ్ సావన్‌కా ఘన్ఆయా
క్యా నయా సందేశా లాయా?

(లేచి గదిలో అటూ యిటూ తిరుగుతుంది.) సాయంత్రం పార్టీకి నీహారం ఆహ్వానం చేస్తున్నట్లున్నది. ఫిలింపాటలు ఎక్కువై పోయినవి. ఈ థర్డ్ రేట్ పాటలువినడానికీ, పాడడానికీ జనం ఎందుకంతుబలాటపడతారో తెలియడంలేదు.

(లోపలినుంచి పాట)

రిమ్ ఝిమ్ రిమ్ ఝిమ్ బూందియాఁ బరసే
నయన్ దరస్‌కో తేరే తరసే
సాజన్
ఓ సాజన్!
డేరా పరదేస్ లగాయా!

—: వీరి జీవితపుహద్దులు పరిమితాలు. ఆహద్దుల్లోనే అటూ ఇటూ తిరుగుతూ ఉంటారు. రాత్రింబగళ్ళు వారికి అదేపని. బయిటపడడానికి ప్రయత్నం గూడాచేయరు. జీవితంలో పైకి ఎగరవలెననే, దుముకవలెననే భావమే లేదు. ఉన్నతోన్నత జీవితం కొరకు కోరికాలేదు. సంఘర్షణా లేదు:

తెరలో (పాట)
జీవన్‌మేఁ జవానీ ఆయీ
మస్తీ మస్తానీ ఛాయీ
సాజన్
ఓ సాజన్!
దిల్ బైక్ బైక్ ఘబరాయా!

—: ఈ రోజు ఈ తుక్కుపాట వినవలసిందే. పాపా ఈఇల్లన్నా మార్చరు. మారిస్తేమాత్రం లాభమేమిటి? ఈపాట వినపడదుగాని మీల, ప్రతిమ, పాపా, మమ్మీ వారి గోలనుండి విముక్తి లభించేదెలా? ఈ నిరర్థక జీవితంలోనుండి విముక్తి లేదు.

యహ్ సావన్ కా ఘన్ ఆయా!
క్యా నయా సందేశా లాయా?

(తెరలోనుండి పాట వినపడుతూనే ఉంటుంది. ప్రతిభ గదిలో అటూ యిటూ వ్యాకులంగా తిరిగి ఒక దరవాజా తలుపు మూసివేస్తుంది. పాట నెమ్మదిగా వినపడుతుంది. ప్రతిభ మందాకినిని పిలుస్తుంది. తాను కిటికీలోనుండి బయటికి చూస్తూ నిలబడుతుంది)

ప్రతిభ: మందా ! (జవాబు రాలేదు)

ప్రతిభ: (క్షణమాగి) మందా!

(నీలిమ ప్రవేశిస్తుంది)

నీలిమ: ప్రతిభా! (దగ్గరకువచ్చి) ప్రతిభా!...ప్రతిభా!

ప్రతిభ: (వెనకకు తిరిగి) రా నీలీ! నీహారానికి పాట నేర్పివచ్చావా?

నీలిమ: పాట?

ప్రతిభ: ఆఁ. సాయంత్రం పార్టీకి.

నీలిమ: లేదు. నేను ఇప్పుడే బజారునుండి వస్తున్నాను. దాహమయింది. మంచి నీళ్ళు తాగడానికి ఇటువచ్చాను.

ప్రతిభ: రా. కూర్చో. మందా! మందా!

మందాకిని: వస్తున్నా.

ప్రతిభ: ఏమొచ్చింది నీకు? ఎంతసేపయింది? ఒక్క-గ్లాసు షర్బత్............

నీలిమ: తొందరగా తెప్పించు. నాలుక ఎండిపోతున్నది.

ప్రతిభ: నేను ఊరికినే తెమ్మన్నాను. ఆగ్లాసు నీవు తాగు. నాకు దాహంగాలేదు. మందా! (లేచి లోపలికి పోబోతుంది.)

నీలిమ: (ప్రతిభను కూర్చోబెట్టి తనుగూడా కూర్చుంటుంది) పెద్దబజారులో సురేశ్ కన్పించాడు.

ప్రతిభ: (మాట్లాడదు.)

నీలిమ: శకుంతల అతనిపక్కనే ఉన్నది.

ప్రతిభ: (మాట్లాడదు.)

నీలిమ: మీ జోడా బాగాఉండేది. శకుంతల సురేశ్‌కు సరిపోలేదు. మీ కిద్దరికీ ఎందుకు సరిపోలేదో?

ప్రతిభ: మా యిద్దరిలో బౌద్ధిక సమానత లేదని ఎన్నిసార్లో చెప్పానుగదా!

**షీలిమ:** నీవేమీ ప్రయత్నించలేదు.

**ప్రతిభ:** ప్రయత్నం వ్యర్థం.

**షీలిమ:** అయితే అతనిని పెళ్ళి ఎందుకు చేసుకొన్నావు? నీకు మొదటినుండీ సందేహ మున్నదనుకొంటాను. అందుకనే సివిల్ మ్యారేజి జరగవలెనని పట్టుబట్టి కూర్చున్నావు.

**ప్రతిభ:** ఇప్పుడు ఆకథఅంతా ఎందుకు? అతని టెన్నిసు ఆటనుచూచి ముగ్ధురాల నైనాను. కాని అతని జీవితపు హద్దులు సంకుచితమైనవని అనుకోలేదు. శకుంతల ఆనందంగా అక్కడ ఉండగలదు. నాకు ఇట్లా ఉండడమే బాగున్నది. మరీవిసుగుపుడితే నీలాభునిదగ్గరకు వెళ్ళుతుంటాను.

**షీలిమ:** నీలాభుడా!

**ప్రతిభ:** అతని దగ్గర ఒక్కక్షణం కూర్చున్నా నాకు ఎంతోశాంతి లభిస్తున్నది. ఆయనగూడా ఏకాకిగా జీవితం గడుపుతున్నాడు.

**షీలిమ:** వయస్సు అంత ఎక్కువ కాదనుకుంటాను.

**ప్రతిభ:** వయస్సుప్రశ్న లేనేలేదు. నిష్టగా అధికశ్రమచేసి తొందరగా అలసి పోయినాడు. కోలాహలానికి దూరంగాఉండి శాంతంగా, విశ్రాంతిగా చదువుకొంటూనో, వ్రాసుకుంటూనో ఉంటాడు. అతని అనుభూతులు విశాలంగానూ, లోతుగానూ ఉండడంవలనా- అతనిజ్ఞానం అపారం కావడంవలనా అతనిదగ్గర పదిక్షణాలుగడిపితే మనస్సు తేలికఅయి నట్లుంటుంది. అందువల్ల ఈ వాతావరణంలో విసిగినప్పుడల్లా ఆయన దగ్గరకు వెళ్ళి పోతుంటాను.

**షీలిమ:** అయితే వివాహమే చేసుకోరాదూ?

**ప్రతిభ:** వివాహమా?

**షీలిమ:** అవును. ప్రదీపుడు......నారాయణ......విశ్వా......నగేంద్ర్.... ఇప్పుడు జ్ఞానచంద్ మహాశయుడు. ఈ ఫ్రస్ట్రేషన్‌వలన ప్రయోజన మేమిటి?

**ప్రతిభ:** ఒకసారి వివాహం చేసుకొని తప్పుచేశాను. నిజానికి నా ప్రకృతి వివాహానికి అనుకూలమైనది కాదు. నా మనస్తత్వంలోని మూలాలలోని స్వతంత్రమూ, సుసంస్కృతమూ అయిన జీవితంయొక్క సుందరమూ-

సజీవమూ, పవిత్రమూ అయిన చిత్రం అంకితమై ఉన్నది. వివాహం చేసుకొని ఆ చిత్రాన్ని కళంకితం చేసుకొనదలచలేదు. అందువల్లనే సురేశ్‌తో నాలుగురోజులు గడపడంగూడా నాకు కష్టమైపోయింది. నాచేతనైతే ఎక్కడో ఒకనదవొడ్డునకూర్చుని నేనేనిర్మించుకొన్న కొత్త ప్రపంచపు సుఖస్వప్నాలలో జీవితం గడుపుదామని ఉన్నది, కాని ఈసమాజంలో అది సంభవంకాదు. అందువల్ల అందరితో కలుస్తుంటాను. కాని తామరాకుమీద నీటిబొట్టులాగా నీళ్ళలోఉన్నా ఎప్పుడూ నీళ్ళపైననే నానివాసం.

(లేచి కిటికీదగ్గరకువెళ్ళి నిలబడుతుంది. మందాకిని షర్బత్‌గ్లాసుతీసుకొని లోపలికి ప్రవేశిస్తుంది.)

**మందాకిని:** ఇదిగో షర్బత్.

**ప్రతిభ:** నీలీకి ఇవ్వు.

**నీలిమ:** (షర్బత్ తీసుకొంటుంది) ప్రతిభా! నీవు మాకొక సమస్యగాతయారయినావు. (షర్బతు ఒక గుక్కతాగి) నీ బ్లౌజు తయారయిందా?

**ప్రతిభ:** లేదు.

**నీలిమ:** నా బ్లౌజు తయారయింది. చేతులులేకుండా కట్టించుకొన్నాను. నీవు చెప్పినట్లే.

**ప్రతిభ:** నేను పూర్తిచేతులది కుట్టిస్తున్నాను.

**నీలిమ:** పూర్తిచేతులదా? ఎలాంటిచేతులు?

**ప్రతిభ:** రష్యన్ ఫాషన్ (నవ్వుతుంది) నగ్నసౌందర్యంకంటే సగం దాగి, సగం తెరువబడి మధురమధురంగా ఉండే సౌందర్యమే ఆకర్షణీయంగా ఉంటుంది.

**నీలిమ:** అయితే చీర బాటిల్‌గ్రీన్ రంగుదేనా?

**ప్రతిభ:** అవును. ఎందుకు అలా అడుగుతున్నావు?

(ప్రతిభ కిటికీలోనుండి బయటకు చూస్తుంటుంది)

**నీలిమ:** మొన్న ఆరెండూ బాగున్నవంటే నీవు నవ్వి ఎగతాళి చేశావుగదా? ఇప్పుడు...... ఆ కిటికీలోనుంచి మాటిమాటికి ఎవరిని చూస్తున్నావు?

**ప్రతిభ:** ఎవరినీలేదు. పరుగెత్తుతున్న మేఘాలను చూస్తున్నాను.

నీలిమ: మొన్న పనికిరానివి ఇవాళ పనికివచ్చినవి.

మందాకిని: (ప్రవేశించి) దర్జీ వచ్చాడు.

ప్రతిభ: పిలువు.

నీలిమ: రెవికచేతులు స్త్రీల బానిసత్వానికి చిహ్నాలు అన్నావుగదా? జీవితం స్వాతంత్ర్యాన్ని కోరుతున్నది. కనుక వర్షఋతువులోని చల్లని వాతావరణంలో చేతులులేని బ్లౌజు ఆనందం.........

(దర్జీ ప్రవేశిస్తాడు)

దర్జీ: సలామ్ హుజూర్.

ప్రతిభ: ఏమి సాహెబూ! చాలారోజులు పట్టించావు. ఇప్పుడైనా సరిగా కుట్టి తెచ్చావా? మొదట బిగువుచేశావు.

దర్జీ: తొడుక్కొని చూడండి అమ్మగార్.

ప్రతిభ: (బ్లౌజు తొడుగుకొని) ఈసారి బాగానే ఉన్నది. ఏమేనీలీ?

నీలిమ: బాగా కుదిరింది. బజారుకుపోయి యిలాంటివి నేనుకూడా కుట్టించుకుంటాను.

దర్జీ: పెద్దపని చేసీఉండాన్ సర్కార్! రెండురోజుల్ పట్టింది.

ప్రతిభ: చీరఏది?

దర్జీ: ఇదిగో సర్కార్!

ప్రతిభ: ఆ బల్లమీదపెట్టు. మిగతావికూడా తొందరగా కుట్టితీసుకొనిరా.

దర్జీ: (చీర బల్లమీదపెట్టి) ఎల్లుండి తెస్తాన్ సర్కార్!

నీలిమ: నా బ్లౌజు దర్జీ తెచ్చినప్పుడు జగం నాదగ్గరే కూర్చొని ఉన్నాడు. ఏమిటి ఈ సన్యాసుల రంగు అన్నాడు.

ప్రతిభ: జగం! జగం ఎవరు?

నీలిమ: జగన్నాథం. క్రికెట్‌టీమ్ కెప్టెన్.

ప్రతిభ: ఓహో అతనా! క్రికెట్‌మీద అతనికి విరక్తిపుట్టిందా ఏమిటి? స్వయంగా బంతి కావలెనని ప్రయత్నిస్తున్నాడన్నమాట (నవ్వుతుంది). బంతిని గ్రౌండు అవతలకు విసరి పారవేశేవు? జాగ్రత్త.

నీలిమ: అందరూ నీలాగే అని అనుకుంటున్నట్లున్నావు?

ప్రతిభ: ఆ బంతిని కాలితో తిరిగి కావలెనన్నా దొరకకుండా ఉండేటట్లు తన్ని పారవేయి. తెలిసిందా?

నీలిమ: ఆ వేదాంతి ఏమయినాడు? గ్రౌండు అవతల పడ్డాడా? ఇవతలనే ఉన్నాడా?

ప్రతిభ: వేదాంతి ఎవరు?

నీలిమ: ప్రొఫెసర్ జ్ఞానచంద్.........

ప్రతిభ: మా ఇద్దరిమధ్యా ఇదివరకున్నంతదూరం ఇప్పుడూ ఉన్నది. ఎక్కువా లేదు. తక్కువా లేదు. ఆ దూరంలో మార్పు లేకుండా చేసుకోవడం నాకు బాగా తెలుసును. మా స్నేహం బౌద్ధికమైనది.

నీలిమ: బౌద్ధికస్నేహంకూడా ఒకతమాషాస్నేహమే. జ్ఞానచంద్ యూనివర్సిటీలోకి వచ్చిన దగ్గరనుండీ, లేక ఇరుగుపొరుగువాడైన దగ్గరనుండీ సినిమాలుకూడా మానుకొన్నావు.

ప్రతిభ: తల ఖాళీగా ఉన్నవారికి సినిమాలు నచ్చుతవి.

నీలిమ: పిక్నిక్ లేదు......షికారు లేదు......

ప్రతిభ: అవన్నీ పనిలేనివారి వ్యసనాలు. సినిమాకుపోవలసివచ్చినప్పుడు నాకెంతో బాధగా ఉంటుంది. మనఫిలింకంపెనీవాళ్ళు తీస్తున్న పనికిరాని చిత్రాలు చూస్తూఉంటే నాకసలు మతిపోతున్నది. ఒక్కొక్కప్పుడు ఆ తెర చింపివేద్దామన్నంత ఆవేశం కలుగుతున్నది.

నీలిమ: అన్నీ దొంగమాటలు. హరదత్తుతో కలసి—

ప్రతిభ: సినిమాలు తెగచూసేదానివి అనిగదా నీవనబోయేది? సురేశ్‌తో సంబంధం విచ్ఛేదం జరిగిన తరువాత జీవితం శూన్యంగా అదొకరకంగా ఉండడంవలన వివశురాలనై హరదత్తు ప్రోద్బలంమీద సినిమాలకు పోయేదాన్ని.

నీలిమ: హరదత్తుకు సినిమాలపిచ్చి చాలావున్నది.

ప్రతిభ: అతడు బుద్ధివాదిలాగా నటనచేస్తుంటాడు. సినిమాహాలులో కూర్చున్నప్పుడు తనను తాను మరచిపోయి పిచ్చి సినిమాపాటలకు తలవూపడం—తాళంవేయడం మొదలుపెడతాడు. ఒకసారి గొంతు పిసుకుదామనిపించింది.

**షీలిమ:** ప్రొఫెసర్ జ్ఞానచంద్‌కు సినిమాలంటే ఇష్టం ఉన్నట్లులేదు.

**ప్రతిభ:** అతడు బుద్ధివాది. సినిమాలు చూడడం కాలాన్ని వ్యర్థపరచడమని అతని అభిప్రాయం.

**షీలిమ:** నీవుమాత్రం......బుద్ధివాదాన్ని ఆశ్రయించడంలేదా?

**ప్రతిభ:** అదే వచ్చిన కష్టం. నేను బయటకు పోదామంటే ఆయన వద్దంటాడు. ఆయన పోదామని బయలుదేరినప్పుడు నాకు ఆమూడ్ రావడంలేదు.

**షీలిమ:** అయితే మీరిద్దరూ గంటల గంటలు ఏమి మాట్లాడుకొంటారు? ఇలాంటి బౌద్ధిక మైత్రిఅంటే నాకేమీ అర్థంకావడంలేదు. ఆ కూర్చోడమన్నా—మాట్లాడుకోడమన్నా అంతూపంతూ ఉంటేనా?

**ప్రతిభ:** నిజమే. కాని జ్ఞానచంద్‌తో మాట్లాడుతూ ఉన్నప్పుడు అనవసరంగా కాలం వ్యర్థమవుతున్నదని అనిపించడంలేదు. అతని జీవితపువిలువలు—అతని దృష్టికోణం అందరిలాంటిదికాదు. నీలాభుని శిష్యుడు. నేనునిజం చెప్పుతున్నాను. నేను......

**షీలిమ:** నీకు తగిన సహచరుడు దొరికాడన్నమాట. ఇవిగో నా శుభాకాంక్షలు. నీవు ఎక్కడైనా వెళ్ళినా వెళ్ళకున్నా సాయంత్రం ఈ బౌద్ధిక సహచరున్ని వెంటబెట్టుకొని మాయింటికి తప్పకుండా రా. మందాకినితో నాకు పనిఉన్నదని మా దాసీమనిషి జబ్బుపడింది. మీ అమ్మతో చెప్పి మందాకినిని తీసుకొని పోతున్నాను.

(మందాకిని ప్రవేశిస్తుంది.)

**మందాకిని:** అమ్మా ఎవరో ఒకాయన వచ్చాడు. ఇదిగో కార్డు.

**ప్రతిభ:** (కార్డుచూచి) జగన్నాథం!

**షీలిమ:** అరే! జగమా? సరే, ఇక్కడికే వచ్చాడు. పార్టీ ఏర్పాట్లన్నీ ఆయనే నిజానికి చూస్తున్నాడు.

**ప్రతిభ;** ఆ క్రికెటరును పిలువు, చూద్దాం. మాటలలోనైనా నాకుగూడా కొంత క్రికెటు వ్యవహారం తెలుస్తుంది.

**షీలిమ:** ఇప్పుడుకాదులే. సాయంత్రం తప్పకుండా రావాలి. (లేస్తూ) ఈబ్లౌజు నీకు ఎంత బాగున్నదే!!

ప్రతిభ: నీకంత బాగుంటే తీసుకోనిపో. నీ బ్లౌజు నేను తీసుకొంటాను.

నీలిమ: తీసుకోనా? నిజంగా?

ప్రతిభ: తీసుకో.

నీలిమ: కాదులే. నీవే......

ప్రతిభ: ఏదో ఉత్సాహంలో వీటిని కుట్టించాను. ఇప్పుడెందుకో తొడుక్కుందా మంటే సంకోచంగా ఉన్నది. ఈ బుద్ధివాదాన్ని దూరంగాబెట్టి సామాన్యులలాగా జీవితం గడుపుదామని అప్పుడప్పుడు అనిపిస్తూ ఉంటుంది కాని రెండో నిమిషంలోనే ఏదో మనస్సులో రియాక్షన్ ఏర్పడుతున్నది. నీలీ! ఇవి రెండూ నీవు తీసుకో.

నీలిమ: (నవ్వుతూ) నీవు ఏదితొడుగితే అదే బాగున్నదని అందరూ అంటారు. అవసరమైతే తెప్పించుకుంటాను. ఉండనివ్వు.

(తెరలోనుండి పాట)

యహ్ సావన్ కా ఘన్ ఆయా

క్యా నయా సందేశా లాయా!

ఈ నీహారం ఈపాటవెంట బడింది. అమర్‌నాధ నేర్పిపోయినాడు. ఎప్పుడు చూచినా శ్రావణమేఘాలు పరుగెత్తుతూ ఉండడమే! విని విని చెవులు కాయలుగాచినవి. వస్తా. నీప్రా జ్ఞానచందూ తప్పకుండా రావాలి. బై. బై. (వెళ్ళిపోతుంది.)

(తెరలోనుండి పాట)

సబ్ సఖియాఁ నాచేఁ గాచేఁ

మిల్‌జుల్ సావనీ మనారహేఁ

సాజన్

ఓ సాజన్!

క్యా నవజీవన్ హై ఛాయా

యహ్ సావన్ కా ఘన్ ఆయా

క్యా నయా సందేశా లాయా

ప్రతిభ: నవసందేశం! నవ్యజీవితం!! ఫిలిమ్ పాటలు, ఫిలిమ్ ఫేషన్. ఫిలిమ్ జీవితం...—ఉఁహ్

(టెలిఫోన్ గంట మోగుతుంది)

—: (రిసీవర్‌ను చేతులోనికి తీసుకొంటుంది) హలో - హలో...ఎవరు?— హరదత్తా!......నమస్కారం. నమస్కారం. షుక్రియా......ఇవాళ క్షమించు...... (నవ్వుతుంది) కాదు. అదికాదు. ఇవాళ నీహారం పుట్టినరోజు. నీలిమ ఇప్పుడే పిలిచివెళ్ళింది. వెళ్ళకపోతే బాగుండదు... కొత్తదేమిటి, పాతదేమిటి?...సినిమా ప్రపంచం అంతా ఒక్కటే... తప్పకరండి...నమస్కారం. నమస్కారం.

(రిసీవరు క్రింద పెడుతుంది. మందాకిని ప్రవేశిస్తుంది)

మందాకిని: జ్ఞానచంద్ గారు వచ్చారు.

ప్రతిభ: పిలువు.

మందాకిని: దయచేయండి.

(జ్ఞానచంద్ ప్రవేశిస్తాడు)

జ్ఞాన: నమస్కారం.

నలిమ: నమస్కారం. రండి. దయచేయండి.

జ్ఞాన: కులాసాగా ఉన్నారా? మొఖంమీద ఈ ముడతలన్నీ ఏమిటి?

ప్రతిభ: నా సంగతి సరే. మీసంగతి చెప్పండి. చాలారోజులనుండి కన్పించలేదు.

జ్ఞాన: ఒక నాటకం వ్రాస్తున్నాను.

ప్రతిభ: (నవ్వి) నాటకమా? అదెప్పటినుండి?......చూపించండి.

జ్ఞాన: (పడకకుర్చీమీద కూర్చొని) వ్రాయలేకపోయినాను. వ్రాసిన భాగం చించిపారవేసి ఇటువచ్చాను. చదువుఎక్కువయినతరువాత వ్రాయడం కష్టం.

ప్రతిభ: నా స్థితికూడా అట్లాగే ఉన్నది. నా మనస్సులో రేగుతున్న తుపాన్లన్నింటినీ లిపిబద్ధం చేదామని అప్పుడప్పుడు కోరిక కలుగుతుంటుంది. ఎంతో ఆలోచిస్తాను. రూపురేఖలు తయారుచేసుకొంటాను. కాని తీరా వ్రాయడానికి కూర్చుంటే రెండుపంక్తులుగూడా పూర్తి కావడంలేదు.

జ్ఞాన: నా ఉద్దేశ్యంలో మీరు వివాహం చేసుకోవాలి.

ప్రతిభ: వివాహమా? (నవ్వుతుంది)

జ్ఞాన: ఫ్రాయిడ్......

ప్రతిభ: ఫ్రాయిడ్ సూత్రాలను నేనూ చదివాను. కాని నేను వివాహం కొరకు జన్మించినట్లు కనపడదు. మీరు నాటకం ఏవిషయంమీద వ్రాస్తున్నారు?

జ్ఞాన: పవిత్రప్రేమ అనేది వట్టి అభూతకల్పన అని ఫ్రాయిడ్ అభిప్రాయం. ప్రతి ప్రేమికుడూ తన హృదయాంతరాళంలో శరీరసంబంధమైన ప్రేమవాంఛ కలిగిఉంటాడు. కాని నాఉద్దేశ్యంలో స్థిరమైనప్రేమ ఎంత ఆధ్యాత్మికమో, అంత శారీరకంగాదు.

ప్రతిభ: అసంతృప్తికి రెండోపేరు స్థిరమైన ప్రేమ.

జ్ఞాన: నిజం. మానవుడు తన శారీరక వాంఛలను తీర్చుకొనలేక జీవితమంతా అసంతృప్తినే పవిత్రప్రేమ అనుకొని భ్రమజెందుతున్నాడు.

ప్రతిభ: వాస్తవానికి అతనిలో ఉన్నది పవిత్రప్రేమగాదు. మండుతున్న శారీరక కామవాంఛయే.

జ్ఞాన: అవును. ఇంకొకరకమైన ప్రేమ ఉన్నది. దానికి పరమావధి కేవలం శారీరక వాంఛా తృప్తిమాత్రమే. తరచు అనేకమంది అందమూ, శీలమూ కలిగిన తమ భార్యలనువదలి అనుభవం కలిగిన ఏవేశ్యకడకో వెళ్ళి ప్రేమను అనుభవిస్తున్నామనుకోవడం చూస్తున్నాము. తమ భార్యలదగ్గర లభించని శారీరకానందమే వారి ఆ ప్రేమ.

ప్రతిభ: ఏమిటి?

జ్ఞాన: కాని కొన్నిసార్లు శారీరిక ఆకర్షణలేని- ఉపేక్షాదృష్టితో తానుచూసే— స్త్రీని ఒక్కొక్కప్పుడు పురుషుడు వివాహం చేసుకొంటున్నాడు. అయినా ఆస్త్రీ తన సహజ సద్గుణాలతో ఆపురుషుని వశం చేసుకొంటూ న్నది. ఆ ప్రేమలో నూటనాలుగు నూటఅయిదు డిగ్రీల జ్వరంఉండదు. నార్మల్‌కంటె కొంచెం ఎక్కువవేడి మాత్రం ఉంటుంది.

ప్రతిభ: అయితే మీరు వివాహం జేసుకోవాలి.

జ్ఞాన: (ఆశగా) వివాహమా!

ప్రతిభ: ఎవతెనో శీలం కలిగిన కురూపిని వివాహం చేసుకోండి. (నవ్వుతుంది)

జ్ఞాన: బుద్ధివాదులమై మనం సన్నిపాతంలాంటి ఈ ప్రేమ జంజాలంలోనుండి ఎప్పుడో బయటపడ్డాము. నాబోటివారిదగ్గర ప్రేమఅనే నిప్పురవ్వ

రవ్వగానే ఉంటుందిగాని జ్వాలగా మారలేదు. ఈ చీర, ఎవరిది? ప్రతిమదా?

ప్రతిభ: కాదు. నాది.

జ్ఞాన: మీదా?

ప్రతిభ: (నవ్వుతూ) నిప్పురవ్వలోనుండి అప్పుడప్పుడు జ్వాలను పుట్టించవలెనని ప్రయత్నిస్తుంటాను.

జ్ఞాన: ఈ చీర కొట్టవచ్చినట్లున్నది. మీలోని సౌమ్యతకు.........

ప్రతిభ: మనుష్యుడు పెద్దవాడైన కొద్దీ అతని కోరికలు భూతకాలంలోనికి ఎక్కువగా పరుగెత్తడం సహజం. నేను తిరిగి చిన్నపిల్లను కావలెనని కోరుకుంటున్నాను. ఈ రోజు సాయంత్రం నీలి యింట్లో పార్టీ.

జ్ఞాన్: అలాగా!

ప్రతిభ: మీకు ఆహ్వానమున్నది.

జ్ఞాన్: ఆహ్వానం ఉన్నది. కాని అక్కడకు పోవలెనని ఉద్దేశ్యంలేదు. మీరు వెళ్ళుతున్నారా?

ప్రతిభ: కూర్చొని కూర్చొని విసుగ్గా ఉన్నది. అందువల్ల వెళ్ళుదామను కొంటున్నాను. పక్క యిల్లేగదా! లేకపోతే నీలి అలుగుతుంది. ఇవాళ నీహారం పుట్టినరోజు.

జ్ఞాన్: పుట్టినరోజా! (నవ్వుతూ) పార్టీలకోసం ఏవోకొత్త కొత్త మార్గాలు. ఏమోగాని నాకీపార్టీలంటే ఏమీ ఇష్టంఉండదు. ఈ పార్టీలలో పురుషులు Chivalrous గా ఉన్నట్లు కనపడడానికీ, స్త్రీలు తమ కురూపాన్ని చేతనైనంతగా దాచడానికి ప్రయత్నిసుంటారు. అంతా ఆడంబరం. మంచి హోటలుకు కాఫీ తాగిరావడం ఇంతకంటె మంచిపని.

ప్రతిభ: పార్టీకి పోక తప్పదు. ఇక ఈచీర. ఇదికట్టుకొని పోను దీనిని నీలికి యిస్తాను. దానికి ఈ చీర చాలా యిష్టం.

జ్ఞాన: బాగున్నది. ఈ చీరను నీలికి యిచ్చివెయ్యండి.

ప్రతిభ: ఎలా ఉంటుందో ఒకసారి కట్టుకొని చూస్తా. (లోపలికి పోబోతుంది జ్ఞానచంద్ వెళ్ళిపోవడానికి లేస్తాడు)

ప్రతిభ: వెళ్ళి పోతున్నారేమిటి? కూర్చొండి.

జ్ఞాన: ఇక వెళ్ళుతాను.

ప్రతిభ: కూర్చోండి. వర్షం వచ్చేటట్లుగా ఉన్నది. తడిసిపోతారు. చీర మార్చుకొని వస్తాను. ఎలా ఉంటుందో కొంచెం చూడండి. (లోపలికి వెళ్ళుతుంది) (మందాకిని ప్రవేశం)

మందాకిని: అక్కా ఏదండి!

జ్ఞాన: లోపల చీర మార్చుకొంటున్నది

మందాకిని: ఎవరో వచ్చారు. ఇదిగో కార్డు

ప్రతిభ: (లోపలినుండి) ఎవరు?

జ్ఞాన: (కార్డు చదివి) జగన్నాథం!

ప్రతిభ: క్రికెట్ టీమ్ కెప్టెనా?

జ్ఞాన: వివరాలు తెలియవు. ఈ కార్డుమీద జగన్నాథం అని ఉన్నది.

ప్రతిభ: అతనే. మందా! ఆయనను లోపలికిపిలువు. నీలీస్నేహితుడు

మందాకిని: దయచేయండి. (జగన్నాథాన్ని లోపలికి పిలిచి తాను వెళ్ళిపోతుంది)

(జగన్నాథం ప్రవేశం. చేతిలో ఒక ప్యాకెట్ ఉంటుంది)

జగన్నాథం: (ఆవేశంతో) Good Afternoon

జ్ఞాన: (ఎసుగ్గా) Good Afternoon రండి. కూర్చోండి.

జగన్నాథం: మిస్ నారాయణ్ ఎక్కడ?

జ్ఞాన: ఆగదిలో. ఇప్పుడే వస్తుంది.

జగన్నాథం: నేను ప్రక్కయింటినుంచి వచ్చాను.

జ్ఞాన: మిస్ నీలిమ యింటినుంచేనా?

జగన్నాథం: Yes

(ప్రతిభ కొత్తచీరా బ్లౌజూ ధరించి ప్రవేశిస్తుంది.)

జగన్నాథం: (లేచి) నమస్తే.

ప్రతిభ: నమస్తే. మీరు క్రికెటిటీమ్ కెప్టెన్............

జగన్నాథం: (రంగు ఎఱ్ఱబడుతుంది) అవునండీ.

ప్రతిభ: వీరిపేరు ప్రొఫెసర్ జ్ఞానచంద్. యూనివర్శిటీలో ఫిలాసఫీ ప్రొఫెసర్.

జగన్నాథం: (లేచి చేతులుకలిపి) Hou do you do

జ్ఞాన్: Hou do you do

జగన్నాథం: నీలిమ ఈ చీటీ, ఈ ప్యాకెటు యిచ్చిందండి.

ప్రతిభ: (చీటీ చదివి) నేను ఊరికనే ఎట్లాఉంటుందోనని కట్టుకొన్నాను. ఇప్పుడే మార్చి యిచ్చివేస్తాను.

జగన్నాథం: నీలిమ ఈ చీర కావలెనన్నదా? ఈ చీర మీకు చాలా బాగున్నది! మీ బంగారు కెంట్రుకలు—ఈబాటిల్ గ్రీన్‌రంగూ......

ప్రతిభ: (ప్రశంసను వినకుండానే) నీలిమకు ఈ చీర చాలాయిష్టం.

జగన్నాథం: కాని......ఆమె......కాని.

ప్రతిభ: నాకు ఇంత కొట్టవచ్చినట్లుండే రంగు యిష్టంలేదు

జగన్నాథం: (రెప్పలార్ప కుండా చూస్తూ) ఈ రంగు అసలు మీకొరకే పుట్టినట్లున్నది. ఈ చీర కట్టుకొంటే నీలిమ గుడ్డబొమ్మలాగా కనపడుతుంది.

ప్రతిభ: ఆ పాకెట్ ఇలాతెండి.

జ్ఞాన్: సరే త్వరగా చీరమార్చండి, మనం కొంచెం బజారుకువెళ్ళాలి.

ప్రతిభ: నేను రాలేను.

జగన్నాథం: నీలిమ చీటీలో వ్రాయలేదా? ఏవోవస్తువులు కొనాలి, మీ సహాయం తీసుకొమ్మన్నది.

ప్రతిభ: నీలిమ సహాయం చేయకూడదా?

జగన్నాథం: ఆమె ఫర్నిచర్ సర్దుతున్నది కాఫీహౌస్‌లో ఒక కప్పుకాఫీ...

ప్రతిభ: కాఫీయా!......బాగున్నది...... That is excellent. జ్ఞాన్‌చంద్ గారు కూడావస్తారు.

జ్ఞాన: వానవచ్చేటట్లున్నది. నా ఆరోగ్యం సంగతి మీకుతెలుసునుగదా!!

జగన్నాథం: నాకారులో పోదాం.

ప్రతిభ: లేవండి. చీరమార్చుకొనివస్తాను. అబ్బా! ఎంతగా మేఘంపట్టిందో!

(లేచిలోపలికి వెళ్ళి చీర మార్చుకొనివస్తుంది)

(అందరూ వెళ్ళిపోతారు)

తెరపడుతుంది

(సశేషం)

పుస్తక పరిచయం:

(సమీక్షకుగాను రెండు ప్రతులు పంపవలెను—సంపా॥)

# ఉదయ కిరణాలు

## [ గేయ మాల ]

రచన: "కళారవి"

ప్రచురణ. సరసరచనా సమితి        మూల్యం: 8 అణాలు

ప్రతులకు: నవయుగ బుక్‌హౌస్, బ్రాడీపేట. గుంటూరు.

ఆంధ్ర సాహిత్య సాగరంలోకి తానూ ఒకబోటు తయారుజేసుకొని జోరో బద్దానంటున్నాడు కవి. ఎందుకయ్యా అనిఅడిగితే మనందరికి అందకుండా చిందులు త్రొక్కుతున్న ఆ "మరోప్రపంచపుముద్దుబాల సామీప్యాన్ని అడ్డదారిని అధిగమించాలని"అంటున్నాడు. తెల్లమీసాల నావికులు తమవెంబడిరమ్మని పిలుస్తే ఇతని బోటువెనక్కు తగ్గింది. "నెత్తురుమండే శక్తులునిండే సైనికులారా రారండి వయస్సు మళ్ళిన ఎముకలు కుళ్ళినసోమరులారా చావండి" అంటూఉల్లాసంగా పాడుతూవస్తున్న నావికులను అనుసరించాడీయన. ఇది ఈయన మొదటిప్రయత్నం అందుచేత కొన్ని గేయాలలో అక్కడక్కడా నడక సాఫీగాలేదు. భావాలు పరుగెత్తు తున్నంత వేగంగా శబ్దాలు పడలేదు. ఈయన కవిత వ్రాయడానికి చాలా సహజంగా ఉపక్రమించాడు.

జలజల పారే జలపాతాలు మిలమిల మెరిసే మిను మేఘాలు
తళతళ లాడే దివోదయాలు ఫెళఫెళలాడే ప్రేలుడు కొండలు
ఎన్నో రహస్యాలు చెబుతున్నయి అందరినీ రమ్మంటున్నయి—

"పశేషం"అనే గేయంలోని ఈదిగువ పంక్తులు చూస్తే ఈయన అప్పుడే అనుకరణలో పడ్డాడా అనిపిస్తున్నది.

నిజాయితీ గలమానవుడా విన్ను నీవు రెట్టించుకో
నూతిలోని మానవుడా నీలోని విన్ను నిలదీసుకో;

.... .... .... .... .... .... .... .... .... .... ...

పల్చని నీ ఆలోచనల పొరలపై పెట్టిన పేపర్ వెయిట్
పక్కకు తుళ్ళించు కొని పై కెక్కగ లేవో. యూనైట్

ఇంకా, "ఆలోచించండి" "హృదయవిపంచిక" "పాతబడి-కొత్తపంతులు" "చిక్కుసమస్య" మొదలగు గేయాలు కూడా బాగున్నాయి. భాషాసౌష్ఠవాన్ని పెంపొందించుకొని, నేటికవితారీతులపై వెలువడుతున్న విమర్శనలను దృష్టి యందుంచుకొని, జీవితపు లోతులలోకి పోగలిగి నట్లయితే ఈ రచయిత కొంత వరకు కృతార్థుడుకాగల సూచనలున్నవి. —దీ రా.

# విశ్వగీతి

## (గీతికావ్యం)

రచన : శ్రీ సి. నారాయణరెడ్డి. మూల్యం : ఆరు అణాలు.

ప్రాప్తిస్థానము : ఆంధ్ర బుక్ హౌస్, సుల్తాన్‌బజారు, హైదరాబాదు.

గీతికావ్య రచనలో శ్రీ సి. నారాయణరెడ్డిగారు సిద్ధహస్తులనుటకు "నవ్వని పువ్వు" మున్నగువానితో పాటు ఈ "విశ్వగీతి" మరియొక తార్కాణము. ఒకనాడు శ్లోకములే కావ్యరచన కుపకరించుననుకొను భ్రమ కవులకుండెడిది. ఆ భ్రమతొలగించుటకు జయదేవ మహాకవి "గీతగోవిందము" రచించెను. లలిత లలితములైన పదములనేరికొని గీతములుగా కూర్చుటలో నారాయణరెడ్డిగారు జయదేవ మహాకవిని అనుసరించి విజయము నందినారు. రెడ్డిగారివలె అత్యంత లలిత పదజాలమును గేయములందు కూర్పగలవారు ఈనాడు అరుదు అను" అతిశయోక్తి కాదు. "ఎలనవ్వుల తులకించే, తెలివెన్నెల పువ్వుల పులకించేట వంటి పంక్తులు లెక్కకుమించి మనకు "విశ్వగీతి"లో కనిపించును. ఇంచుమించు నాలుగు వందల పంక్తులుగల ఈ దీర్ఘగీతము ఎత్తైన ఆకాశాలను చుంబించుచు, లోతైన కవి అంతరమును స్పర్శించుచు పయనించినది. ఇందు ఆకాశమునకంటు నంతటి ఔన్నత్యము, హృదయమును స్పృశించు నంతటి గాంభీర్యము అడుగడుగున గోచరించును. పతితులు, పీడితులు అయిన వారిని పరామర్శించుచు, వారిబాధలను చూచి వేదన పడుచు విశ్వమందలి ప్రతివస్తువును తనదిగాచేసి కొనుచు ఈ గీతము పయనించును "జలపాతాలు నిట్టూర్చుట; కంపాలశిలలు చెమర్చుట; మృత్యువర్తకీ కరాళ నృత్యంలో తెగిపోయిన కింకిణీగణ గళ సంగీతం; నవనీత కావ్యనిక్వాణము; అజంతారమణీ కపోలాంచల చంచల హాసము" వంటి ఉత్తమ భావ చిత్రములు ఈకావ్యమునకు అభినవ్యతను చేకూర్చిపెట్టినవి భావుకులెల్లరు దీనిని పఠించవలెను.

—ఐ. కృష్ణమూర్తి.

## పుస్తక స్వీకారం

1. ఉదయతార కవితాసంగ్రహం రచన: శ్రీ కారుమంచి వెంకటేశ్వరరావు.
2. దైన్యాలోకము కవితాసంగ్రహం రచన: శ్రీ గొట్టుముక్కల కృష్ణమూర్తి.
3. పూలమాల కవితాసంగ్రహం రచన: శ్రీ డాక్టర్ శంకరరామారావు.
4. సీతాహృదయము కవితాసంగ్రహం రచన: శ్రీ డాక్టర్ శంకరరామారావు.
5. మణి దీపాలు. కథానికలు. రచన: శ్రీ పురిపాక జగన్నాథరావు.
6. నయాజమానా కవితాసంగ్రహం రచన: శ్రీ వి. శశాంక.

సర్వోదయప్రెస్, మహాకాళివీధి, సికింద్రాబాదు.



హైదరాబాదు విద్యాశాఖామాత్యులు శ్రీ దేవీసింగ్ చౌహాన్‌గారు హిందీ ప్రచారక విద్యాలయ
తృతీయ వార్షికోత్సవమునకు అధ్యక్షత వహించిరి 1953.



హైదరాబాదు ప్రభుత్వ ఆర్థిక శాఖామాత్యులు శ్రీ వినాయకరావు విద్యాలంకార్ గారు
విద్యాలయ చతుర్థ వార్షికోత్సవమునకు అధ్యక్షత వహించిరి. 1954.

Edited, Printed and Published by V. Anjaneya Sharma, 327 Residency Road
Title Printed at The Modern Printing House, 51, Jambagh Road, Hyd-Dn.